# సాహిత్యకల



K. Venkata Rao.

ఇది

సాహిత్యవిశారద

## కాశీభట్ట సుబ్బయ్యశాస్త్రిఁచే

విరచింపఁబడినది.

ప్రథమ ముద్రణము 1000 ప్రతులు.



కాకినాడ

శ్రీపతి ముద్రణాలయమున

ముద్రింపఁబడినది.

1937.



[వెల రు. 0—8—0.

# పీఠిక.

•○◇○•

శ్రీ శ్రీ శ్రీ జయపురసంస్థానాధీశ్వరులు, సాహిత్యసామ్రాడ్బిరుదాంకితులు, శ్రీ శ్రీ విక్రమదేవవర్మమహారాజావారు సాహిత్యవిశారద బ్రహ్మశ్రీ కాశీభట్ట సుబ్బయ్యశాస్త్రిగారిని "సాహిత్యకల" యనుగ్రంథరచనమునకుఁ బ్రోత్సహించి, యాంధ్రవాఙ్మయమునకు మహోపకృతిని గావించిరి.

శ్రీ శాస్త్రిగారిపరిణత పాండితీప్రసూనముగ నీగ్రంథము వెలువడినది. సమదృష్టి గలవిమర్శనమున కాదర్శప్రాయమై యున్నది. పాశ్చాత్యసారస్వతఝంఝానిలభంజితమై యున్న మాతృభాషయొక్క స్వరూపసంప్రదాయము లిందు విస్ఫుటముగ వివరింపఁబడియున్నవి.

ఆసేతుహిమాలయపర్యంతము వెలయుచున్న భారత నాగరకత శాంతిభూయిష్ఠమై, లలితకళాశోభితమై, యుత్కృష్టాదర్శభాసమానమై, సంస్కృతమునందును దేశభాషలయందును దేజరిల్లుచున్నది. "శాంతం శివం సుందర" మ్మను నుపనిషద్వాక్యమిందుకు దృష్టాంతమై యున్నది.

ఏదేశమందైనను వాఙ్మయము జాతీయజీవనప్రతిబింబ ఫలకమై యుండును. జాతీయాంతరాత్మపరిశుద్ధికి నికషోపలముగఁ గూడ నుండఁ దగియుండును. ప్రాచీనకావ్యనాటకలక్షణముల శ్రద్ధతోఁ బరిశీలించిన నందు భారతసారస్వతాదర్శములు నిండు

శోభతోఁ గానవచ్చును. సంపూర్ణదివ్యరసానుభూతియు నద్వితీయసుఖానందాప్తియు నందుఁ గానగును.

కాలవశమున నిటీవల భిన్నలక్ష్యసంధాయకములును, భౌతికసుఖానందపిపాసాభాజనంబులు నగు విదేశసారస్వతవిద్యుల్లతాతండములు కనుల మిఱుమిట్లు గొలిపి, మనదృక్పథముల మఱల్పఁ బూనియున్నవి. ఇట్టితఱి నీసాహిత్యకల, దివ్యాంజనము వంటిదియై యున్నది.

ప్రాచ్యపాశ్చాత్యనాగరకతలు పూర్వపశ్చిమసముద్రములవంటివి. ఒకటి శాంతిసమృద్ధము. రెండవది మహోన్నతతరంగమాలాఘూర్ణితము. భారతీయు లాత్మగౌరవమును, జాతీయతత్త్వమును లెస్సగ గుర్తెఱింగి, లలితకలాపోషణమును నిర్వర్తించుట కర్తవ్యమై యున్నది. లలితకలాసౌందర్యవిభూతి దేశకాలపరిచ్ఛిన్న మెన్నటికిని గాదు. మానవహృదయమును దివ్యరసరంజితముగఁ జేసి, యనిర్వచనీయ మగుసృష్టిలీలఁ గొనియాడుచు, పరాత్పరుని యానందైకస్వభావమును దిలకించి, మానవుఁడు తనజీవితయాత్రను గడుపుకొనునట్లు చేయుటయే లలితకలాప్రవృత్తికి ముఖ్యఫలమై యున్నది.

ఇంకను నిట్టియుత్తమగ్రంథములఁ బ్రేరణమునకును రచనలకును శ్రీ విక్రమదేవవర్మమహారాజులంగారిని గ్రంథకర్తలను పరమేశ్వరుఁడు చిరాయురున్నతులతో ననుగ్రహించుఁగాక.

ప్రభల లక్ష్మీనరసింహము,
బి. యే., బి. యల్.

# ఆశీర్వాదము.



తపస్సిద్ధిసంపన్నులై లోకశ్రేయమును గూర్చు గ్రంథరాజముల రచియించిన మహాకవుల ప్రబోధము లిపుడు పనికి రాకుండఁ జేయుటకై నవ్యసంస్కారపరాగము పరదేశముల నుండి పరుగిడి వచ్చి, భారతభూమిని గప్పివేయుచున్నది. ఆహేతువుచే యువకు లనేకులు కన్నుల సరిగా నుపయోగించుకొననేరక, సారవత్కావ్యములఁ ద్రొక్కివైచి, నిస్సారసారస్వతములకై తహువులాడుచున్నారు. ఇందుచే నీతియు నియమము చెడుచున్నవి. పూర్వమర్యాద లన్నియు మాఱిపోవుచున్నవి.

దేహబాధ తీర్చుకొనుటకై మదపతులు మఱుఁగుదొడ్లలోఁ బ్రవేశించియున్నపుడు చూపట్టు మర్మావయవములు తళుకుదీపములతోఁ జూడఁబడుచున్నవి. వైరాగ్యవ్రతలుగా నుండఁ దగిన వితంతుసోదరీమణుల కుచాదులు వక్రముగా వర్ణింపఁబడుచున్నవి. మఱియుఁ జిన్నగుడ్డలు కట్టుకొని మడి పనులు చేసికొనుచున్న యువతులు గోడలపైనుండి తొంగి చూడఁబడుచున్నారు. దిగంబరలై స్నానమాడుచున్న పర భార్యలపృష్ఠభాగసౌష్ఠవములు విపులముగాఁ జిత్రింపఁబడుచున్నవి. ఇట్టియమంగళవిషయములు సత్కావ్యముల నుండఁ దగినవి కావని యందఱకు విదితమే.

వీనిని బరికించునపుడు సాహిత్య మెంతటిదుర్దశకు వచ్చుచున్నది! అని పరితాప మందని భారతీయుఁ డుండఁ డని నా భావము.

ఈనవ్యసాహిత్యమువారు వాడుభాషకూడ కేవలపామరులు వాడుకొను గ్రామ్యభాషకంటెను నధమముగా నున్నది. ఇట్టియసభ్యసాహిత్యరచనలఁ గాంచి, పరితప్తహృదయుఁడై నాసోదరుఁడు చిరంజీవి సుబ్బయ్యశాస్త్రి "సాహిత్యకల" అను గ్రంథమును వ్రాసి నాకు వినుపించినాఁడు.

ఇందు సాహిత్యమన నేమో, లోకహితమును గూర్చు కావ్యరచన మెట్లుండవలయునో, అసభ్యవర్ణనములచే సారస్వత మెట్లు కలంకిత మగుచున్నదియో లోనగువిషయములు చక్కఁగ వివరింపఁబడియున్నవి. సాహిత్యసామ్రాడ్బిరుదాంచితులును, శ్రీ జయపురమహారాజులును అగు శ్రీ శ్రీ విక్రమదేవవర్మబహాద్దరువారు ఈగ్రంథమును ఆదరభావముతో సాంతముగాఁ జిత్తగించి, సంతసించి, దీనిం గృతిగా నందికొని, కవి నానందింపఁజేయుటయేకాక, సాహిత్యకలను బ్రకాశవంతమునుగాఁ జేసిరి. మణి శాణోల్లేఖముచేతను, కృతి నృపతిగ్రహణముచేతను శ్లాఘ్యతమము లగును.

దేశకాలపాత్రములఁ బరికించి, జ్ఞానద మగు నిట్టిగ్రంథమును వ్రాసిన నాసోదరుని, దీనికి విలువను సమకూర్చిన శ్రీ శ్రీ శ్రీ జయపురమహారాజావారిని ధర్మసంస్థాపనబద్ధస్పృహుఁడగు భగవానుఁడు దీర్ఘాయురారోగ్యాదిసంపదల నొసంగి, కాపాడుఁగాక !

కాశీభట్ట బ్రహ్మయ్యశాస్త్రి.



కృతి కర్తలు:

సాహిత్యవిశారద

కాశీభట్ట సుబ్బయ్యశాస్త్రిగారు.

# విన్నపము.



గౌరవానందములతో జీవయాత్రను సాగింపఁ గోరు వారు నీతి నాదరించుటయు, నవినీతి నేవగించుటయు ధర్మము. ఇట్లు చేయుటకే వివేక మని పేరు. మన పూర్వకవివరులు సంఘాభివృద్ధిసాధనము లగు ధర్మబోధలతోడను, నీతిపూతము లగు చరితములతోడను, లలితము లగు కవితారీతులతోడను అలరారు భారతరామాయణాదిసత్కావ్యముల విరచించిరి. వాని నాంధ్రులు భక్తితోఁ బఠియించి తమజీవితములఁ గీర్తి వంతములనుగాఁ జేసికొనుచుండిరి.

కలికాలప్రాభవముచే నేఁ డాంధ్రసాహిత్యమునందు దుర్నీతిపూరితములును, సంఘావమానహేతుకములు నగు నసభ్యకవితలు విరివిగాఁ దల లెత్తుచున్నవి. ఈనాఁటి యువతీ యువకులు ఈరీతివ్రాఁతలనే చదువుట కుబలాట పడుచున్నారు కాని సత్కావ్యముల నవలోకింపఁ గోరుట లేదు. కావున నీతి విరహిత మగు నీయసభ్యసాహితీగతిని నిరోధింపకున్న యువతీ యువకు లతివేగముగా మితిమీఱిన దుర్నీతిపా లగుట నిశ్చయము.

ఈనవ్యాసభ్యసాహిత్య మెంతటియవినీతిభాజనమై యున్న దియో వెల్లడించి, ఏతన్నివారణమునకు సంసారు లెల్లరు ప్రయత్నింపవలయు నని ప్రబోధించుటయు, ఇట్టియవినీతికవితల నల్లి పిల్లలయుల్లములఁ గలంకితములనుగాఁ జేయవలదని కవిసోదరుల హెచ్చరించుటయు, ఈగ్రంథముయొక్క ముఖ్యోద్దేశములు.

గతవత్సరము విశాఖపట్టణమున జరుపఁబడిన భారతీతీర్థవార్షికోత్సవసభలో నవ్యసాహిత్యమునుగూర్చి నే నొకింత ప్రసంగించియుంటిని. అపు డాసభ కధ్యక్షపీఠము నలంకరించియున్న శ్రీ శ్రీ జయపురప్రభువరు లగు శ్రీ విక్రమదేవవర్మ మహారాజావారు లేచి, "శ్రీ సుబ్బయ్యశాస్త్రిగారు శ్రీరామవిజయాదికావ్యముల విరచించుచున్నారు. వీరు ప్రస్తుత మా గ్రంథరచనల నిలిపి, నవ్యసాహిత్యమునుగూర్చి యొకగ్రంథము వ్రాయఁ గోరుచున్నాను" అని గౌరవాదరములతో సెల విచ్చిరి. "శ్రీ శ్రీ మహారాజావారి యాజ్ఞానుసారము నాశక్తి ననుసరించి గ్రంథమును వ్రాయుదు" నని నే నాసభలో శ్రీవారితో మనవి చేసియుంటిని. ఇపు డీగ్రంథము శ్రీ శ్రీ మహారాజావారి ప్రోత్సాహాదరములచేఁ బ్రకటింపఁగల్గితిని

ఇందు నట నటఁ గొంచెము వెచ్చగా ముచ్చటించియుంటిని. ప్రకరణరసపోషణమునకై యట్లు వ్రాయవలసివచ్చినది. ఆవేఁడిచురుకులకుఁ గారణము హృదయావేదనమే గాని, పరిహాసభావము కా దని, సహృదయు లగు సోదరులకు నివేదించుచున్నాను.

వేదవేదాంగాదివిద్యాకోవిదులును, ఆంధ్రాంగ్లసంస్కృతసాహితీధౌరేయులును, వైదికకర్మానుష్ఠానగరిష్ఠులును అగు బ్రహ్మశ్రీ శ్రీ శ్రీ ప్రభల లక్ష్మీనరసింహము బి. యే. బి. యల్., అడ్వకేటుగారు సోదరభావముతో నీగ్రంథమునకుఁ బీఠికను వ్రాసినందులకు వందనశతముల నందఁజేయుచున్నాను.

విరులు వెల లేనివైనను భక్తవరదుఁ డగు శ్రీహరి వానిం బ్రేమతోఁ జేకొనునట్లు ఈగ్రంథ మంతమూల్యవంతము కాకున్నను ఉదారహృదయు లగు శ్రీ శ్రీ విక్రమదేవవర్మమహా రాజావారు దీని నాదరముతోఁ గృతిగాఁ జేకొని నా కానంద మును సమకూర్చియున్నారు శ్రీవా రితోధికైశ్వర్యారోగ్యాభి వృద్ధులతోఁ జిరంజీవులై స్వరాజ్యసారస్వతములఁ బోషించుచు సుఖముగా నుందురుగావుత.

నాకు విజ్ఞానగురువులును, విమర్శకాగ్రేసరాదిబిరుదాం కితులును అగు మాయన్నగారు శ్రీ బ్రహ్మయశాస్త్రిగారు అనారోగ్యముచే మంచముపట్టి కదలలేనిస్థితిలో నుండియు నా యీ గ్రంథమును ఆదరముతో సాంతముగా విని, నాయందలి వాత్సల్యముచే శ్రేయస్కర మగు నాశీర్వాదమును బ్రసాదించి నందులకు వినయభయభక్తిగౌరవములతో నమస్కృతులఁ జేయుచున్నాఁడను.

అచ్చుపొరటలయందలి పొరపాటుల సవరించుటలో శ్రమఁ గొని, సాహాయ్య మొసర్చిన సూరివరు లగు శ్రీ కొత్తపల్లి సూర్యారావుగారికి ధన్యవాదములు. ఆంధ్రసోదరీసోదరు లెల్లరు నేకమై అనురాగమందారతరుచ్ఛాయను జేరి యానందముతో ఆంధ్రసాహితీమధురరసముఁ బానము సేయునట్లు మాయమ్మ—తెలుంగుసరస్వతమ్మ—యనుగ్రహించుఁగావుత. ఓం తత్సత్ !

విబుధవిధేయుఁడు,

కాశీభట్ట సుబ్బయ్యశాస్త్రి.

# కృతిసమర్పణము.



సకలకలాభిజ్ఞులును, షడ్భాషాకోవిదులు, ఆంధ్ర
విశ్వకళాపరిషత్సహాయాధ్యక్షులు, సాహిత్య
సామ్రాడ్బిరుదాంచితులు, శ్రీ జయపురా
ధీశ్వరులు నగు

శ్రీ శ్రీ శ్రీ

## విక్రమదేవవర్మ

మహారాజా డి. లిట్ మహాశయులకు సాహిత్యకల
యను గ్రంథము నాచేఁ గృతిగా
సమర్పింపఁబడినది.

కాశీభట్ట సుబ్బయ్యశాస్త్రి.



కృతిభర్తలు.
శ్రీ జయపురాధీశ్వరులు
సా॥ సమ్రాట్బిరుదాంకితులు నగు
శ్రీ శ్రీ విక్రమదేవవర్మ మహారాజావారు.

సాహిత్యకలావిరాజితులు, పండితకవులు నగు బ్రహ్మశ్రీ చిలకమర్తి లక్ష్మీనరసింహముగారును, జయంతి రామయ్య పంతులుగారును దయతో నొసంగిన యోగ్యతాలేఖల వందనములతో నందికొని, యీక్రిందఁ బొందుపఱచితిని.



"సాహిత్యవిశారద బ్రహ్మశ్రీ కాశీభట్ట సుబ్బయ్య శాస్త్రిగారిచే రచింపఁబడిన "సాహిత్యకల" అనుగ్రంథమును సాంతముగా విని సంతసించితిని. ఈగ్రంథము మొదట సాహిత్య స్వరూపాదుల వివరించి, అటుపిమ్మట నేఁటికాలమున వెలువడుచున్న భావకవిత్వములమీఁదను, వారి యితరరచనలమీఁదను, చేయఁబడిన సరియైన విమర్శనము. ఆకవులు వ్రాసినవ్రాఁతలలో నశ్లీలములు, నసభ్యములు, నమంగళములు, నవాచ్యములు, మొదలగుదోషములఁ దీసి చూపి, శాస్త్రిగారు వానిని యుక్తియుక్తముగా ఖండించిరి.

ఆభావకవుల రచనలలోని కొన్నివిషయములు చెప్పఁబడినప్పుడు నేను వినలేక, కటకటంబడి, చెవులు మూసికొంటి నని చెప్పవలసివచ్చినందులకు మిక్కిలి చింతించుచున్నాను. అనాదినుండియు హిందువులభక్తిగౌరవములకుఁ బాత్రము లైన సీత, సావిత్రి, దమయంతి మొదలగుపతివ్రతాశిఖామణుల నీ భావకవులు కులటలుగఁ జిత్రించి, యువతీయువకుల మనస్సుల

నెట్లు పాడుచేయుచున్నారో! ఈగ్రంథమును జదివినఁ దెలియును.

సారస్వతవృక్షమును నాశనము చేయు చీడపురుగుల వంటి గ్రంథములు పఠనీయములు గావని, శాస్త్రిగారివిమర్శ నము స్పష్టముగఁ జాటుచున్నది బాలబాలికామానసక్షేత్రము లను దుష్టభావప్రవాహమున ముంచివేయుచున్న యీగ్రంథ జాలము ఎంతత్వరలో నంతరించిన నంతమేలు దేశమునకుఁ దప్పక చేకూరును. శాస్త్రిగారు నేఁటికాలపుగ్రంథముల నెన్ని టినో చదివి, ఈవిమర్శనమును వ్రాసి, దేశమునకు మహోప కారము చేసి రనుట యతిశయోక్తి కాదు. ఈవిమర్శనమునందు వ్యక్తిదూషణము లేక కేవలవిషయముమాత్రమే చర్చింపఁబడి నది ఇందుకు శాస్త్రిగారు మిక్కిలి వంద్యులు.

ధర్మపరిపాలనమును, అధర్మనిర్మూలనమును, ఉత్తమ క్షత్రియులకు ప్రధానలక్షణము లగుటచే శ్రీ శ్రీ విక్రమదేవవర్మ మహారాజావారు శాస్త్రిగారి నీసద్విమర్శనరచనకుఁ బ్రోత్స హించి, స్వధర్మాభిరతిని వెలిపుచ్చుట యెంతయు ప్రశంసా వహము. దేశహితాభిలాషు లగు మహాపురుషులును ఈదుష్ట వాఙ్మయమును రూపుమాపుటకుఁ దగుప్రయత్నములు చేయు దురుగాక!

రాజమహేంద్రవరము, 16—11—37. } చిలకమర్తి లక్ష్మీనరసింహము.

బ్రహ్మశ్రీ కాశీభట్ట సుబ్బయ్యశాస్త్రిగారు రచించిన "సాహిత్యకల" యను గ్రంథమును చదివించి విన్నాఁడను. శ్రీ శాస్త్రులుగారీగ్రంథ పూర్వభాగమందు సాహిత్యకలా స్వరూపమును నిరూపించి, యుత్తరభాగమునందు ఇప్పుడిప్పుడు నవ్యసాహిత్య మనుపేర బయలుదేఱుచున్న యపూర్వసాహిత్య గ్రంథములఁ గొన్నిటిని విమర్శించి వానియందుఁ దమకుఁ దోఁచినదోషముల నుద్ఘాటించిరి.

దీని రచనాపద్ధతియు నిండలిభావములును, సంప్రదాయసిద్ధముగాను యుక్తియుక్తముగాను నున్నవి. సాహిత్యము స్వరూపమును దానివలన ప్రయోజనములును విద్యానాథుఁడిట్లు నిరూపించియున్నాఁడు.

"కాంతాసమ్మిత యా యయా సరసతా మాపాద్య కావ్యశ్రియా
కర్తవ్యే కుతుకీ బుధో విరచిత స్తస్యై స్పృహాం కుర్మహే॥"

అకార్యములందు ద్వేషబుద్ధియుఁ గార్యములందు నాసక్తియుఁ గల్గించుట కావ్యపఠనమువలని ముఖ్యప్రయోజనములనియుఁ గావ్యరచనయందుఁ గల సరసత్వముచేత నీఫలము చక్కఁగా లభించు ననియుఁ బైవాక్యము భావము. కావ్యములన్నను సాహిత్య మన్నను నొక్కటే. సాహిత్యగ్రంథములు సరసము లగుపలుకులచేత నీతిబోధము చేయునవిగా నుండవలయు నని దీని తాత్పర్యము. ఇట్లుండవలయు నన్నఁ గావ్యములం

దితివృత్తము ధర్మబోధకముగా నుండుటయేగాక, భాష సత్సంప్రదాయసిద్ధముగను సభ్యముగను నుండవలయును. సుబ్బయ్యశాస్త్రిగారు చెప్పినప్రకార మిప్పుడిప్పుడు బయలుదేఱుచున్న నవ్యసాహిత్యగ్రంథములు కొన్నింటిలో నీరెండువిషయములందును బెక్కులు దోషములు గనఁబడుచున్న వన్నమాట సత్యము. పెక్కుగ్రంథములందు భావములును భాషయునుగూడ నసభ్యమును, నశ్లీలమును, కేవలప్రాకృతజనోచితములుగాను నున్నవి. ఇట్టిగ్రంథములను జదువుటవలనఁ బసిపిల్లలమనములందు దుర్భావములు గలుగుట కవకాశ మున్నది. కావున భాషాభిమానులును దేశాభిమానులును నట్టిగ్రంథములను స్పష్టముగా గర్హించుట యుచితము. శాస్త్రిగా రీగ్రంథమును రచించి లోకోపకారము గావించినా రని నాయభిప్రాయము.

ముక్త్యేశ్వరము,
22—11—1937. }

జ. రామయ్య.

ఓమ్!

# సాహిత్యకల.



శ్లో॥ వంద్యా సా సాహితీవిద్యా భావార్థపదనాదినీ
లభ్యతే యత్కటాక్షేణ వివేకానందవాహినీ॥

ఈశ్వరసృష్టియందు మానవసంఘమునకు సకలసంపదల సమకూర్చి, అనిర్వచనీయ మగు నానందమును సాక్షాత్కరింపఁజేయునది సాహితీవిద్యాసముపాసనమే.

మానవసంఘమునకు సౌఖ్యముల సమకూర్చువస్తువులు గృహారామధనకనకవస్తువాహనాదులు. కావున మానవుల కట్టి సుఖదము లగుపదార్థముల సమకూర్పవలయును కాని సాహిత్యము నందఁజేయుట యెందులకు? ఇది లేకున్నఁ గలుగులోప మేమి? ఈయది యున్నఁ జేకుఱుభాగ్య మేమి? అని శంకింపఁ జనదు.

మానవులు గృహాదుల సంపాదించుకొనుట సౌఖ్య మందుటకొఱకుఁ గదా? అట్టిసౌఖ్యమును మించిన అమేయానందమును సమకూర్చువస్తువు సిద్ధముగా నున్నపుడు కేవలగృహాదులపైనే, మక్కువఁ జూపుట న్యాయము కాదు. ఆయమూల్యానందభాగ్యము నందఁజేయుపదార్థము నందికొనుటకుఁ బ్రయత్నించుట ప్రాజ్ఞతాలక్షణము.

గృహాదులు లేవనులోపమునుగూడఁ గానఁబడకుండఁ జేసి, అసదృశానందసంపదను సంఘటింపఁజేయునది సాహిత్య

విద్య. దీని నారాధించుటవలన దుఃఖములు దూరములై, సౌఖ్యములు సన్నిహితము లగును. అజ్ఞానాంధకార మదృశ్యమై, వివేకచంద్రిక ప్రత్యక్ష మగును. అపయశము లీనమై, ఘనకీర్తి వికసించును. కడుపేదమొదలు ఘనసంపన్నునివఱకును గల మానవసంఘము సత్కావ్యశ్రవణపఠనాదులచే సుఖమగ్నమైన నిదర్శనము లెన్నియో కలవు. కావున మానవులు సుభాషిత రసముల నాస్వాదింపఁ బ్రయత్నింపవలయును.

"ఖిన్నం చాపి సుభాషితేన రమతే స్వీయం మన స్సర్వదా
శ్రుత్వా న్యస్య సుభాషితం ఖలు మనః శ్రోతుం పునర్వాంఛతి
అజ్ఞాజ్ఞానవతో ప్యనేన హి వశీకర్తుం సమర్థో భవేత్
కర్తవ్యో హి సుభాషితస్య మనుజై రావశ్యకః సంగ్రహః॥"

సాహిత్యము ఖిన్నమైయున్న మానసమును సంతసింపఁ జేయును. ఒకసారి విన్నఁ దిరుగ వినవలయు ననుకోరిక లుద యింపఁజేయును. అజ్ఞులను ప్రాజ్ఞులను వశముచేసికొనును. కావున సాహిత్యసంగ్రహ మవశ్యకర్తవ్య మని భావము. మఱియు విద్వాంసు లిట్లు తెలిపియున్నారు.

"సుకవితా య ద్యస్తి రాజ్యేన కిం"
"కిం కిం నసాధయతి కల్పలతేవ విద్యా"
"న పుష్యతి మనోరథం క మివ కావ్యచింతామణిః"

సాహిత్య మున్న సామ్రాజ్య మెందుకు? సాహిత్యము సమకూర్పని దేది యున్నది? అని భావము.

## సాహిత్యనిర్వచనము.

సాహిత్యపదమున రెండర్థము లిమిడియున్నవి. సహిత మనఁ గలిసినది. దానిభావము సాహిత్యము. అనఁగా కూడిక. వేనియొక్క? నాదపదార్థభావములయొక్క—యిది మొదటి యర్థము. హితముతోఁ గూడినది సహితము; దానిభావము సాహిత్యము. అనఁగా హితబోధకత, ఫలితార్థము, నాదపదార్థ భావములచే లలితముగా లోకహితముచు సమకూర్చు కల సాహిత్యము. కావుననే నన్నయభట్టారకుఁడు "విశ్వశ్రేయః కావ్యం" విశ్వమంగళమును సమకూర్చునది కావ్యము- అని లక్షణమును నిర్వచించియున్నాఁడు.

"శ్రీరామాదులవలె సన్మార్గమున సంచరింపవలయును కాని, రావణాదులవలెఁ గుపథమునఁ బ్రవర్తింపరాదు" అని బోధించుటకు హితముచు స్తుతించి, అహితము నీసడించి, లోక కళ్యాణమును సమకూర్చుటయే సాహిత్యముయొక్క ముఖ్యధర్మము. సాహిత్యకలోపాసనచే మానవసంఘమునకు సమకూఱుభాగ్యములఁగూర్చి పెక్కురువిద్వాంసులు పలువిధముల నుతించియున్నారు. అందు భామహమహాశయుఁడు ఈరీతిని ప్రశంసించియున్నాఁడు.

శ్లో॥ ధర్మార్థకామమోక్షేషు వైచక్షుణ్యం కలాసు చ
కరోతి కీర్తిం ప్రీతిం చ సాధుకావ్యనిషేవణం॥

అనఁగాఁ బురుషార్థసంపాదనాసక్తియు, సకలకలావిచక్షణశక్తియు, అమేయకీర్తిసంపత్తియు, అనిర్వచనానందప్రాప్తియు, సత్కావ్యపఠనముచే సమకూఱుఁగలవని భావము.

ఇంతియకాదు. పశుత్వమునకంటె మానవత్వము భిన్నమైన దని, విభాగము చేసి, చూపునది సాహిత్యవిద్యయే.

శ్లో॥ సంగీతసాహిత్యకలానభిజ్ఞః
సాక్షాత్ పశుఃపుచ్ఛవిషాణహీనః॥

అనఁగా గానలలితమగు సాహిత్యకళ నెఱుంగనివాఁడు కసవుమెసవు పసరమువంటివాఁడని భావము. పైనఁ దెలుపఁబడినశ్లోకమున సాహిత్యమునకంటె వేఱుగా సంగీతకళ పేర్కొనఁబడియుండ "గానలలితమగు" అని విశేషణగతిని కల్పించి, గానమునకు అప్రాధాన్యమును, సాహిత్యమునకుఁ బ్రాముఖ్యమును నిరూపించుట యెట్లుపొసఁగునందురా? వినుఁ డందులకుఁ గారణమును. పైనఁ గ్రోడీకరింపఁబడిన యుదాహరణమున సంగీతము సాహిత్యాంగముగాఁ దెలుపఁబడినదియేకాని, సాహిత్యమునకంటె భిన్నమని, నిరూపించుటకుఁ గాదు. "సంగీతసాహిత్యకలానభిజ్ఞః" అన సంగీతలలితమగు సాహిత్యకల నెఱుంగనివాఁడని భావము. అంతియకాని, సంగీతకలను, సాహిత్యకలను, అని ద్వంద్వసమాసము కాదు.

సువర్ణము కటకకుండలరూపమును దాల్చునట్లు, శబ్దము గానసాహిత్యరూపమును వహించును. అందుచే సంగీతసాహి

త్యములు శ్లిష్టవస్తువులు కాని, విశ్లిష్టపదార్థములు కావు. ఈ విషయము విష్ణుపురాణమున వ్యక్తముసేయఁబడినది.

శ్లో॥ కావ్యాలాపాశ్చ యే కేచిత్ గీతికా న్యఖిలా న్యపి
శబ్దమూర్తిధరస్యై తే విష్ణోరంశా మహాత్మనః॥

అనఁగా గానసాహిత్యములు శబ్దరూపధారియగు శ్రీహరియొక్క అంశములే యని భావము. కావునఁ బదమునందు నాదకవితలు వేర్వేఱుగాఁ జూపట్టుచున్నను, వాస్తవముచే వస్తుభేదము లేదు. ఈవిషయము ఛాందోగ్యమున వివరింపఁబడినది. "కాసామ్నో గతి రితి స్వర ఇతి హోవాచ" (ఉపనిషత్తు) "యో యదాత్మకః సతద్గతి స్తదాశ్రయశ్చ భవతి, ఇతి, మృదాశ్రయ ఇవ ఘటాదిః" (భాష్యము) అనఁగా నేది దేని స్వరూపమో అది తద్గతికమును, తదాశ్రయమును అగును. ఘటాదులు మృదాశ్రయము లయినట్లు అని భావము. కావున గానమును, కవిత్వమును, శబ్దాశ్రయము లగుటచే మిళితములే కాని భిన్నములు కావు. అట్లగుచో,

శ్లో॥ సంగీతమపి సాహిత్యం సరస్వత్యాః కుచద్వయం
ఏకమాపాతమధురం అన్య దాలోచనామృతం॥

అనఁగా సంగీతసాహిత్యములు భారతీమాతకు పాలిండ్లనియు, అందొకటి ఆపాతసుందరమనియు, రెండవది ఆలోచనామృతమనియు భావము. ఇట్టిపద్యమున సంగీతసాహిత్యములు భిన్నకళలుగా వర్ణింపఁబడుట యెట్లుపొసఁగును? అని శంకింపఁ

బనిలేదు. నిజ మారయ సంగీతము సాహిత్యాంతర్భాగమే కాని భిన్నము కాదు. కావున సాహిత్యరచనయందు ముందు పద మాపాతరమణీయమగు నాదమును పోషించునదిగను, పిమ్మట ఆలోచనాజనితమగు భావామృతమును వర్షించునది గను ఉండవలయును.

ఇట్టిహృదయావర్జకమగు నాదపదార్థభావసమ్మేళనము సాహిత్యమునఁ గలదు; కావుననే. సాహిత్యామృతపిపాసువు లగుతనయులకు భారతీమాతను ప్రత్యక్షము సేయనెంచి, పై పద్యమున హృద్యముగాఁ బయోధరపదార్థమునకు ద్వైవిధ్య కల్పనము చేయఁబడినది. అంతియేకాని కలావిభేదమును నిరూపించుటకుఁ గాదు.

మఱియు నాదికావ్యమగు రామాయణముయొక్క మహిమను వర్ణించు నీక్రిందిశ్లోకము కావ్యమునకు నాదము మోదావహమని ప్రకటించుచున్నది; కనుఁడు.

శ్లో॥ వాల్మీకే ర్మునిసింహస్య కవితావనచారిణః
శృణ్వన్ రామకథానాదం కో నయాతి పరాంగతిం॥

అనఁగాఁ గవితావనవిహారి యగువాల్మీకికేసరియొక్క రామకథానాదము నాలించువాఁ డెవ్వఁడు ముక్తినొందఁడు? అని భావము. ఇట "రామకథాం" అని యనక "నాదం" అని కథతో గానకళనుగూడ మేళవించుటచే నాదస్వరూపవరమగు రామకథను అని, గానసాంగత్యము తెలుపఁబడినది.

రామాయణసాహిత్య మిట్లు వర్ణింపఁబడినది.

శ్లో॥ పాఠ్యే గేయే చ మధురం ప్రమాణై స్త్రిభిరన్వితం॥

అనఁగాఁ జదువుటకును, పాడుటకునుగూడ ననువగు గానమాధుర్యము కలదని భావము. రామాయణగాయకు లిట్లు కొనియాడఁబడిరి.

శ్లో॥ తౌతు గాంధర్వతత్త్వజ్ఞౌ మూర్ఛనాస్థానకోవిదౌ
భ్రాతరౌ స్వరసంపన్నౌ గంధర్వావివరూపిణౌ॥

ఈపైనఁబేర్కొనఁబడిన లక్షణములనుబట్టిచూడ సాహిత్యము సంగీతలలితముగా నుండవలయునని విదితమైనది. కావు ననే స్వరచంద్రికలో నిట్లు తెలుపఁబడినది.

శ్లో॥ సంగీతేన వినా కావ్యం కోవిదాం న ముదావహం
సౌభాగ్యేన యథా శూన్యం కామినీవదనం నృణాం॥

అనఁగా గానహీనమగు సాహిత్యము సౌభాగ్యహీనమగు కామినీవదనమువలె ముదావహము కానేరదని భావము. పెక్కు తర్కము లేల? యతిప్రాసాదిసాహితీనియమములును, వైదర్భ్యాదిరీతులును, గానానుకూలము లగుసంస్కారములే కాని, భావబోధకము లగునిబంధనములు కావు.

క. విశ్రాంతి విరతి విశ్రమ
విశ్రామ విరామ విరమ విరమణ లనఁగా
విశ్రుతమగు యతి కృతి కధి
కశ్రావ్యంబై బెడంగుగా నిడవలయున్.

(కవిజనాశ్రయము.)

ఇందుచేఁ బద్యమున యతి శ్రావ్యంబై యుండవలయు నని బోధింపఁబడినది. శ్రావ్యత గానకళాసాహచర్యముచేఁగాని కలుగనేరదు.

ఆధునికమేధానిధులుకూడ సాహిత్యమున గానకళ కాన నగునని వ్రాసియున్నారు. "కవిగీతమున చిత్రకారుని చిత్రకళా సౌష్ఠవమును, గాయకుని రాగమాధుర్యమును, నెలకొనుటయే కాక" (ఉభయభాషాప్రవీణ యింద్రగంటి హనుమచ్ఛాస్త్రి గారు- వ్యాసావళి)

మఱియు జేమ్సు హెన్రీలేహంట్‌గా రిట్లు తెలిపియున్నారు. "Music and Painting are proud to be related to poetry, and poetry loves and is proud of them"

—James Henry Hunt.

అనఁగా సాహిత్యముతో సంగీతచిత్రలేఖనములు కలియఁగోరుచున్నవి; వానిసాంగత్యమును సాహిత్య మపేక్షించుచున్నది—అని భావము.

మఱియు ధర్మదాసమహాకవి విదగ్ధముఖమండనమున నిట్లు తెలిపియున్నాఁడు.

శ్లో॥ రుచిరస్వరవర్ణపదా రసభావవతీ జగన్మనోహరతి
తత్కిం తరుణీ? నహి నహి వాణీబాణస్య మధురశీలస్య॥

అనఁగా మధురములగు నాదపదములతో హృద్యములగు రసభావములతో మానసము నాకర్షించును. ఏది!

రమణియా? కాదు - కాదు - భాణుని మోహానవాణి. ఇట వర్ణ పదములు రుచిరస్వరయుతములై యుండవలయు ననఁగా గాన రమ్యముగా నుండవలయుననియే భావము.

మోరేశ్వరరామచంద్రకాళేగారు కాదంబరీప్రస్తావనలో నిట్లు వ్రాసియున్నారు. ......And this giving to their words peculiar music sound as apart from ordinary simple prose so that to those who had a peculiar bias against same prose form, these writers appeared merely to have introduced a new kind of metre.

అనఁగా లోకములోఁ బ్రాయకముగా వాడుకలోనున్న వచనరచనయందుకంటె నిందు మనోహరమగు నొకగాననాదము ప్రవేశపెట్టఁబడియున్నది - అని భావము.

శ్రీ గిడుగు వెంకటసీతాపతిగారు కావ్యవాక్కు శ్రావ్యముగా నుండవలయునని తెలిపిరి.

"శ్రావ్యంబై రసవంతమై మధురమై సర్వాంగసంపన్నమై"

సంగీతమునకు రాగజనకములగు స్వరములును, భావబోధకములగు సాహిత్యములును ప్రధానములు. స్వరములేని సాహిత్యమును, సాహిత్యములేని స్వరమును, సంపూర్ణమగు సంగీతము కానేరదు. ఇంతియకాదు. గానకళాంగములగు గీతములు, వర్ణములు, పదములు, కృతులు, లోనగు గేయము

లన్నియు, సాహిత్యసమన్వితము లగుటచేతనే హృదయాకర్ష కము లగుచున్నవి. సాహిత్యవిరహితమగు కేవలనాదమున కంతటి ఆనందజనకత యుండనేరదు.

గానకళాచతురుఁడగు గాయకుఁడు కేవలనాదసుందర మగు రాగము నాలాపనముచేయునపు డుదయించు సంతసము నకును, భావబంధురములగు సాహిత్యముల గానముసేయున పుడు జనించు సంతోషమునకును గల తారతమ్యము రసికజన విదితమే. కావున సంగీతసాహిత్యాత్మకమగు సారస్వతమునకు నాదపదసంశ్లిష్టతయే వ్యక్తిహేతువు.

గాయకప్రావీణ్యముచే ధ్వని గానముగా మాఱును. కవిచాతుర్యముచే భాష కవితగాఁ బరిణమించును. ఈయంశము భావప్రకాశక మనుగ్రంథమునఁ దెలుపఁబడినది.

శ్లో॥ త ఏవ ధ్వనివిన్యాసాస్త ఏవార్థవిభూతయః
తథాపి నవ్యం భవతి కావ్యం గ్రథనకౌశలాత్ ॥

అనఁగా నిత్యవ్యవహారసిద్ధములగు ధ్వనులును, అనుది నానుభూతములగు నర్థములును, కవిచాతుర్యముచే అపూర్వ సౌభాగ్యకలితమగు సాహిత్యగానముగాఁ బరిణమించుచున్నవి అని భావము. ఆనందవర్ధనుఁడు ఇట్లు నుడివియున్నాఁడు.

శ్లో॥ దృష్టపూర్వా అపి హ్యర్థాః కావ్యే రసపరిగ్రహాత్
సర్వేనవా ఇవాభాంతి మధుమాస ఇవ ద్రుమాః॥

అనఁగా అర్థములను దినాకర్ణితములగునవియైనను, రస

వత్కావ్యసంగృహీతము లగుటచే వసంతమాసమాకందము వలెఁ గ్రొత్తవై, ఇంపుఁగొలుపును- అని భావము.

తరంగసాగరసంబంధమువలె నాదపదసంబంధము అవిభావ్యమై యుండును. అనఁగా రెండుగాఁ జూపట్టువస్తువు లొక్కపదార్థమే కాని భిన్నములు కావు. ఈసంగతి పతంజలి మహాభాష్యమున వ్యక్తముచేసియున్నాఁడు. "తస్మాత్ ధ్వనిః శబ్దః" ధ్వనియే శబ్దము- అని భావము. దీనిచే ధ్వనిస్ఫోటల కభేదమును నిరూపించుటయే పతంజలిమతమని విదితమగుచున్నది. అనఁగా నాదసుందరమగు శబ్దము భావరమ్యమగు నర్థమును జనింపఁజేయునని భావము

సామాన్యముగా జనులు కామక్రోధాద్యావేశముచేఁగాని, శమదమాదిపారవశ్యముచేఁగాని, యితరులతో సంభాషించునపుడు ధ్వనులను మార్చి, శబ్దములను బలుకుట నిత్యానుభవసిద్ధము.

ఆయారసానుగుణమగు నాదము అప్రయత్నముగా మాటల నంటి నోటినుండి పైకి వచ్చును. ఆధ్వనిభేదముల పురస్కరించుకొనియే వక్త క్రుద్ధుఁడై యున్నవాఁడో! శాంతుఁడై యున్నవాఁడో! గుర్తింపఁగల్గుదుము. ఈవిషయము భావప్రకాశమున వివరింపఁబడినది.

శ్లో॥ నాదే నవ్యజతే వర్ణః పదం వర్ణాత్ పదాద్వచః
వచసో వ్యవహారో యం నాదాధీన మతో జగత్॥

అనఁగా నాదముచే వర్ణము వ్యక్తమగును; వర్ణముచే పదము, పదముచే వాక్యము, వాక్యముచే లోకవ్యవహారము-ఈరీతిగా లోకవ్యవహారము నాదాధీనమై యున్నదని భావము.

మఱియు, సంగీతదామోదరమున ఇట్లు వివరింపఁబడి నది. శ్లో॥ ననాదేనా వినా జ్ఞానం ననాదేన వినా శివం॥

అనఁగా నాదములేనిదే జ్ఞానముగాని, శుభముగాని, చేకూఱదని భావము. ఇందుచే భావముల వ్యక్తముచేయు పదములందు నాద మిమిడియుండునని విదిత మగుచున్నది.

నిత్యవ్యవహారములో నున్నభాషయే యిట్లు నాదమిళితమై భావభేదముల జనింపఁజేయునపుడు, రసమయమగు సాహిత్యకలను వినియోగింపఁబడు పదసముదాయము నాదానుకూల మగుమార్దవము కలదిగా నుండవలయునని, వేఱుగఁ దెలుపవలయునా? కావున సాహిత్యసంపద నాదపేటికలో నిమిడియున్నదని స్పష్టమగుచున్నది.

సాహితీసరస్వతికి సరిగమాదిసప్తస్వరజనితమగు రాగ నాదము సరిగచీరవంటిది. పదసముదాయము దేహమువంటిది. అర్థము ప్రాణమువంటిది. భావ మాత్మవంటిది. అందుచే నాద పదార్థభావములకు సరసమగు కూడిక లేకున్న రమ్యమగు సాహిత్యకళ ప్రత్యక్షము కానేరదు. పూర్వ లీభావమును ఆదికావ్యనిర్మాతయగు వాల్మీకిమునీంద్రుని స్తుతిలో ధ్వనింపఁ జేసియున్నారు. కనుఁడు,

శ్లో॥ కూజంతం రామరామేతిమధురం మధురాక్షరం
ఆరుహ్యకవితాశాఖాం వందే వాల్మీకికోకిలం॥

ఈపద్యమునందలి కోకిలపదముచే నాదసౌందర్యమును అక్షరపదముచే శబ్దసౌభాగ్యమును మధురపదముచే అర్థమనోహరతను రామపదముచే భావరమ్యతను వ్యక్తముచేసి యున్నారు.

ఇంతటివాద మేల? ఆర్యుల కనాదిసాహిత్య మగు వేదమునకు స్వరము ముఖ్యము. స్వర మన సుందరమగు నాదమే. స్వరరహితమగువేదము శ్రావ్యము కానేరదు. అటులనే వేదజనితమగు లోకసాహిత్యమును, గానదూరమగుచో విన నింపును గొలుపదు.

చక్కని రాగపువరుసతోఁ జదువఁబడినపద్యము విను వారివీనులకు హాయిఁగొలుపు సాహిత్య మగును. అట్లుకానిచో నది యొకరొద యగునుకాని హృద్యమగు పద్యము కానేరదు. అట్లగుచో గద్యము సాహిత్యవిద్యనుండి తొలంగిపోవలసివచ్చునని శంకింపరాదు. ఏమందురా? గద్యపఠనమునందును రాగమును జేర్చి, చదువుటయే యుక్తము ఈవిషయము సంగీత రత్నాకరమున వివరింపఁబడినది.

శ్లో॥ వర్ణజోమాత్రికశ్చేతి కలహంసో ద్విధామతః
గద్యోత్మాచేత్ స్వరాన్ గీత్వా తతః పదనివేశనం॥
అనిబద్ధా నిబద్ధా చ ద్విధా సా గద్యపద్యజా
గాతవ్యా నియమై ర్నిత్యాం గీర్వాణగణవల్లభా॥

అనఁగా గద్యపద్యాత్మకమగు సాహిత్యము స్వరయుక్తముగా గానము చేయఁదగినదని భావము. గద్యము పద్యమట్లు మనోహరముగాఁ జదువువా రెందఱో కలరు; కావున గద్యమును గానార్హమే.

మఱియు "వేద ఇవాత్రా ప్యుచ్చారణ సౌష్ఠవపురస్కా రేణైవ గుణరీతి సంక్రాంతిశరీరా" అను సుబంధూక్తినిబట్టిచూడ సాహిత్య ముచ్చారణసౌష్ఠవము కలదిగా నుండవలయునని విదిత మగుచున్నది. ఉచ్చారణసౌష్ఠవ మన గానకళావిశిష్టతయే. ఇంతియకాదు- గానమునందలి రాగప్రస్తారము సాహిత్యమునందలి రసవిన్యాసానుగుణముగా నుండవలయునని, సంగీత శాస్త్రమునఁ దెలుపఁబడినది.

శ్లో॥ శృంగారరససంపూర్ణో భూపాల ఇతి కథ్యతే
తథా హాస్యరసాత్మకో వసంత ఇతి కీర్తితః॥

(రాగసాగరము.)

శ్లో॥ రౌద్రేద్భుతే తథా వీరే పుంరాగైః పరిగీయతే
శృంగారహాస్యకరుణే స్త్రీరాగైశ్చ ప్రగీయతే॥

(సంగీతమకరందము.)

అనఁగా భూపాలరాగము శృంగారరసపోషకమనియు, వసంతరాగము హాస్యరసరంజకమనియు, రౌద్రాద్భుతవీరరసముల పుంరాగములతో వ్యక్తముచేయవలయుననియు, శృంగార

హాస్యకరుణరసముల శ్రీరాగముతో వ్యక్తముచేయవలయు ననియు భావము.

శ్రీ యస్. యం. టాగూరుగారు రాగరససంబంధమును గూర్చి యిట్లు తెలిపియున్నారు. "Sri Raga represents love; Vasanta is allied with joy; Nata Narayana is of fierce courage" Etc. అనఁగా శ్రీరాగము ప్రణయప్రకాశక మనియు వసంతరాగము సంతోషసూచక మనియు, నాటరాగము ధీరతావ్యంజక మనియు భావము

కావునఁ గావ్యమునందలి రసములను చక్కఁగా వ్యక్తము చేయుటకు రాగప్రస్తారము లుపయుక్తము లని రూఢి యగుచున్నది రాగమాధుర్యములతోఁగూడిన సాహిత్యమే మానసమును వశముచేసికొనును.

శ్లో॥ "తవాస్మి గీతరాగేణ హారిణాప్రసభంహృతః"

అని, శాకుంతలమునఁ జెలుపఁబడినది.

దీనింబట్టి రాగరంజితమగు సాహిత్యము ఆపాతమధురమై, ఆలోచనామృతపూరితమై, మానవలోకమునకు ఆనంద పరవశతను కలిగించుచున్నదని బోధపడును.

ఈచర్చచేఁ దేలినరహస్య మేదియన, రాగరసములకు సరియగుకూడిక చేకూరినఁగాని, కావ్యము శ్రావ్యము కానేరదు అనుసంగతియే. ఈరీతిగా గానసాహిత్యములకుఁ గల సన్నిహిత సంబంధమును బట్టిచూడ శబ్దము - రాగానుకూల మగునాద

ముతోఁ గూడినపుడు గానమనియు, అర్థవ్యంజక మగుధ్వనితోఁ గలిసియున్నపుడు సాహిత్యమనియు, స్పష్టమగుచున్నది.

బిల్హణకవీంద్రుఁడు గానలలితమగు కవితను బలుకువాఁడే లోకోత్తరకవితిలకుఁ డని నుడివియున్నాఁడు.

శ్లో॥ జయంతి తే పంచమనాదమిత్ర చిత్రోక్తి సందర్భవిభూషణేషు
సరస్వతీ యద్వదనేషు నిత్యమాభాతివీణా మివ వాదయంతీ॥

అనఁగాఁ బికకూజితసుందరములగు చిత్రోక్తులతోఁగూడి, వీణానాదసుందరమగు కవితాసరస్వతి యెవరివదనములయందు భాసించుచుండునో వారలే లోకోత్తరకవివరులని భావము.

నిజమే; స్వరరాగములు సంగీతమునకును, రసభావములు సాహిత్యమునకును, కళాస్థానములు. ఈకళలఁ గాంతివంతములనుగాఁ జేయునది శాస్త్రసంస్కారసంపత్తి. ఈసంగతి రాగసాగరమునఁ దెలుపఁబడినది.

శ్లో॥ పరిత్యాగే లక్షణస్య రంజనం నైవ జాయతే
తస్మా ల్లక్ష్యానురోధేన గానం లోకే ప్రశస్యతే॥

ఈభావమునే త్యాగరాజకవిసార్వభౌముఁడు "స్వరరాగసుధారసయుతభక్తిస్వర్గాపవర్గము" అనుకృతియందు ధ్వనింపఁ జేసియున్నాఁడు.

వేదసాహిత్య మేరీతిని నలినభవునివదనమునుండి స్వరపురస్సరముగా బయలువెడలెనో, ఆతీరుననే లోకసాహిత్యము వామలూరుసంభవునిముఖసరోజమునుండి గానకలాలలితముగా

నావిర్భూత మైనది. చతుర్ముఖుఁడు తపస్సమాధిని వేదమును ప్రత్యక్షముచేసికొనినట్లే చతురవదనుఁ డగుప్రాచేతసుఁడు యోగసమాధిచే సాహిత్యసరస్వతీస్వరూపమును సాక్షాత్కారము చేసికొని, ఆయమకు గానపరిధానమును ధరింపఁజేసి, సువర్ణాలంకారముల నమర్చి, భావతిలకమును దిద్ది, సదాగమ సంస్కారములతో సుధాసుందరమగు కావ్యమందిరమునఁ బ్రతిష్ఠించి, జగన్మోహనములగు వీణానాదముల శ్రుతుల నుగాఁ జేసి, సరాగనీరజదళమృదులములగు కుశలవరసనాపల్లవములచే లయానుగుణముగా సాహితీమాతయొక్క సౌభాగ్య లీలఁ గీర్తింపఁజేసియున్నాఁడు.

సారస్వతకాసారమునఁ బ్రాథమికకావ్యసరసిజము నాదామోదశోభితమై ఉదయించినదనుట నిర్వివాదాంశము రామాయణకావ్య మిట్లు గానసుందరమగుటనే పండితపామరజనానంద సంధాయకమై వెలయుచున్నది.

శ్లో॥ హ్లాదయ త్సర్వగాత్రాణి మనాంసి హృదయానిచ
శ్రోత్రాశ్రయ సుఖం గేయం తద్బభౌ జనసంసది॥

అని రామాయణకావ్యము ప్రశంసింపఁబడినది. ఈ ప్రశంసాపద్యమున నొకవిశేషము గోచరమగుచున్నది. అది యేదియందురా? "హ్లాదయ త్సర్వగాత్రాణి మనాంసి హృదయానిచ" అని గాత్రమనోహృదయములు మూఁడును రామాయణగానాకర్ణనముచే సంతోషతరంగితము లైనట్లు తెలుపుటచే

నాదముచే శ్రుతియు, అర్థముచే మానసమును, భావముచే నాత్మయు, రంజితములైన వనుసంగతియే.

రామాయణసాహిత్యము నుపజ్ఞముగఁ జేకొని, కవివరు లనేకులు తమకావ్యముల శ్రావ్యముగా విరచించియున్నారు. కవుల కీరామాయణమే లక్షణగ్రంథము "పరం కవీనా మాధారం" అని తెలుపఁబడినది.

"పురుషార్థసాధనంబు లగుప్రబంధముల సర్వసాధారణ ముగా విన నింపుగావించు స్వరసౌష్ఠవాదులను దెలుపునది గాంధర్వవేదము. అదియే సంగీతశాస్త్ర మనంబడు"

అని అస్మద్గురుపాదులగు మహామహోపాధ్యాయ శ్రీ పరవస్తు వేంకటరంగాచార్యులయ్యవార్లంగారు విద్యాసం గ్రహమున అనుగ్రహించియున్నారు. ఇందుచేఁ బ్రబంధములు విన నింపుగా నుండవలయు ననియు, అట్టియింపును సమకూర్చు నది సంగీత మనియు బోధిత మగుచున్నది.

గద్యపద్యములు హృద్యములుగా నుండవలయునన్న రాగ నాదకలితములై, రసభావమిళితములై యుండవలయును. అనఁగాఁ గవి కావ్యమున సమకూర్చుపదములు గానకళాలాలి త్యమును బోషించు శ్రావ్యతకలవిగా నుండవలయును.

"శ్రావ్యత ననుసరించియే భాషను సంస్కరించవలెను" అని మహామహోపాధ్యాయ శ్రీ తాతా సుబ్బారాయశాస్త్రి గారు ప్రతిభలో వ్రాసియున్నారు. కావున గానకలకు గద్య

పద్యప్రబంధసాహిత్యమునఁ గొలఁదివికాసమును, గీతపదాది సంగీతసాహిత్యము విశేషప్రకాశమును సమకూర్పవలయును.

మఱియు సాహిత్యమును శాస్త్రానుసారముగ నడిపింప వలయును కాని, విధిమర్యాదల విసర్జించి, సాగింపరాదు. "శ్రుతి స్మృతి శాస్త్ర పురాణేతిహాససహిత మగునది సాహిత్య మని, పూర్వపండితుల యాశయము" అని శ్రీ జయపుర మహారాజావారు సెలవిచ్చియున్నారు.

ఈభావమునే కాకునూరి అప్పకవికూడ వ్యక్తము చేసి యున్నాఁడు.

క. శ్రుతిశాస్త్రాంగపురాణ
ప్రతతియు నితిహాసకావ్యభరతాగమముల్
స్మృతిసంగీతరతికళా
గతుల నలంకృతుల నెఱుఁగఁగాఁ దగుఁ గవికిన్.

శాస్త్రానుగుణముగా నడువఁదగినది ఒక్క-సాహిత్యమే కాదు. ఈశ్వరునిచే నిర్మింపఁబడిన యీచరాచరసృష్టియంతయు మర్యాదానుగుణముగా సాగుచున్నది గాని విపరీతమార్గమున నడుచుట లేదు కావుననే ప్రకృతిపరిణామము నిసర్గసుందరమై, తనరారుచున్నది. సాహిత్యకల భావసుందరముగా నుండవలయు నన్న అందలిపలుకులు లలితమగు నాదముకలవిగా నుండవల యును. "భావసౌందర్యము అందంపుపల్కు-లంమఁ గాని ప్రస్ఫు టింపదు"

సాహిత్యతత్త్వవిమర్శనము.

## —♦ సాహిత్య సనాతనత. ♦—

ఇట్టి మహిమాఢ్యమగు సాహిత్యకల నిన్న మొన్న బయలు వెడలినది కాదు. ఈయది విత్తనమున సంకురశక్తివలె వేదనాదమున లీనమై యున్నది. "యోగినాం నాదరూపేణ స్వానుభూతివిధాయినీం" అని భావప్రకాశమునఁ దెలుపఁబడినది. వేదమాత నుపాసించినమహర్షులు శ్రుతిలీనమైయున్న సాహిత్యసుధ నాస్వాదించి "ఏకఃస్వాదునభుంజీత" అను ధర్మవచనానుసారము మధురమగు సాహిత్యమును లోకమునఁ బ్రకాశింపఁజేసియున్నారు.

మానవు లెట్టిమాటల వినవలయునో, ఎట్టివ్రాఁతల నవలోకింపవలయునో, ఎట్టిరసముల నాస్వాదింపవలయునో వేదము చక్కఁగా బోధించుచున్నది. ఆలింపుఁడా ప్రానుమవుల. "భద్రం కర్ణేభిః శ్రుణుయామ దేవాః, భద్రం పశ్యేమ"—"జిహ్వామే మధుమత్తమా" అనఁగా నాపీనులతో మంగళము లగు మాటల వింమునుగావుత! నేత్రములతో శుభదము లగురచనల నవలోకింతునుగావుత! హృద్యమగు భావమును జిహ్వతో వెల్లడింతునుగావుత!- అని భావము.

ఈవేదవచనములనుబట్టిచూడ విడివిడిమాటలు మొదలు రసనిర్భరములగు సాహిత్యగుంభనములవఱకుఁ గలపదపదార్థము లెంతటిపావనోదారభావకలితములుగా నుండవలయునో విదిత మగుచున్నది. ఈపైవిషయములఁ బర్యాలోచనము చేసి

చూడఁ దెలినసొం పేమనఁ, బూలగుత్తియందుఁ గంటి కింపును బుట్టించు చక్కఁదనమును, ముక్కునకు మక్కువనొదవించు తావియు, నాల్కక నుబ్బుఁదలూఁగించు తేనెయు, హృదయమున కానందపరవశతను సమకూర్చు లావణ్యమును, ఇమిడియున్నటుల సాహిత్యరచనలయందుఁ జెవికి మోదమునుగూర్చు నాదమును, మనసునకు సంతసమునొసంగు శబ్దమును, హృదయమునకు రంజకతనాపాదించు అర్థమును, ఆత్మ కానందమునందఁ జేయు భావమును, ఇమిడియుండవలయు ననుటయే ఇట్టిగుణచతుష్టయసమిష్టికే సాహిత్య మని పేరు. దీనికిఁ గవిత్వ మని నామాంతరము. అలంకారశాస్త్రము సాహిత్యసృష్టికిఁ బుష్టిని సమకూర్చు విషయముల వివరముగా స్పష్టముచేయుచున్నది.

నాదపదార్థభావభంగీతరంగితము లగు సాహితీజీవన వాహినులకే లోకమున శ్లాఘ్యత చేకూరును కాని, అసభ్య పదార్థకర్దమపూరితములగు కుకావ్యపల్వలములకుఁ గాదు.

లోకమున వాగర్థయుగళమునకే సాహిత్య మనుప్రసిద్ధి చూపట్టుచుండ, ఇట్లేల నాదపదార్థభావచతుష్టయము సాహిత్యమని తెలుపుచుంటివందురా? ఇది నాయూహ కాదు. సాహిత్యసరోవర విహారశీలురగు కవిహంసలు కీర్తించినభావమే.

శబ్దార్థములే కావ్య మనువారితలఁపున నాదభావములు లేనిపదార్థములు కావ్య మని భావము కాదు. అట్లుకాక కేవల శబ్దార్థములే కావ్య మన్నచో, "కాకి యెగురుచున్నది, దూడ

పరుగిడుచున్నది, కూడుడుకుచున్నది'' లోనగువాక్యములుకూడ కావ్యములు కావలసివచ్చును. కాకి యనుమాట చెవినిఁబడిన తోడనే ఱెక్కలుగల పక్కి యొకటి అనుభవమునకు వచ్చును. ఎగురుచున్నది అనుపదమును విన్నపుడు మింటఁ దిరుగుట యనువ్యాపారము స్ఫురించును. కావున నీవాక్యమున శబ్దార్థ ములు మిళితములై యుండుటచే "శబ్దార్థములు కావ్య" మను లక్షణమునకు వ్యాప్తి పూర్తిగాఁ జూపట్టుచున్నది. కాని సాహి త్యతత్త్వవేత్తలు దీనిని సాహిత్యముగాఁ బరిగణింపరు. కారణ మేమన, ఇందు శబ్దార్థములు కలవు కాని హృదయరంజకము లగు నాదభావములు లేకుండుటయే.

కావ్యమున ఛందోవ్యాకరణాదిసంస్కారలసితమగు శబ్ద జాల మున్నను రాగపోషకమగు నాదమును, రసపోషకమగు భావమును, శూన్యమగుచో ఆనందజనకమగు సాహిత్యము కానేరదు. భ్రమరము మొదట సుమమంజరులయందలి పరి మళముచే నాకృష్టమై, పిమ్మట నందువఱలుచున్న మకరంద మును గ్రోలి, ఆనందపరవశమై యుండునట్లు రసికచంచరీకము ప్రథమమునఁ బదములయందలి నాదామోదముచే నాకర్షింపఁ బడి, అనంతరము అందుభాసించుచున్న భావామృతము నాస్వా దించి, ఆనందపారవశ్యము నందును. కావున శబ్దార్థములు కావ్య మనువారిమతమున నాదభావములుకూడ మిళితములై యున్నవని తెలిసికొనవలయును

అట్లగుచో సాహిత్యరసఘనుఁడగు కాళిదాసకవీంద్రుఁడు రఘువంశకావ్యాదిని, వాగర్థసమ్మేళనసుందరమగు నర్ధనారీశ్వర రూపమునుమాత్రమే ప్రస్తుతించెను కాని, అట నాదభావముల సంఘటించియుండలేదే! ఇందు కేమందు వందురా? తొందర చెందక వినుఁడు. కాళిదాసకవివరుఁడు కావ్యాదిని పార్వతీ శంకరదాంపత్యమునుమాత్రమే వర్ణించెను కాని వారియను రాగానందముల నుతింపలేదే? అంతుచే నవి వారియందు లేవనవచ్చునా? కావున పార్వతీపరమేశ్వరులయందు అనురా గానందము లెట్లు అవినాభావముగాఁ గూడియున్నవియో, అటులనే సాహిత్యమునందలి వాగర్థములయందు నాదభావములు సన్నిహితములై యుండును.

కావుననే కొందఱు సాహిత్యలక్షణనిర్ణేతలు శబ్దార్థ ములే కావ్యములని స్థూలముగా నిర్వచించియున్నారు. అంత మాత్రముచే నట నాదభావములకు చోటు లేదనుకొనుట న్యాయము కాదు. జగన్నాథపండితుఁడు "రమణీయార్థప్రతి పాదకః శబ్దః కావ్యం" అని శబ్దమాత్రమే కావ్యమని లక్షణమని చెప్పియున్నాఁడు. ఇట్టిలక్షణములన్నియు సంగ్రహసూత్రములు. వీనివివరణమున నిజమగుకావ్యస్వరూపము స్పష్టమగును.

కావున నాదపదార్థభావములయొక్క పొందికయే సాహి త్యసారసమునకు అందమును సమకూర్చు కందము. సందేహము లేదు.

## మ ర్యా దా పా ల న ము.

ప్రాచేతసాదిగీర్వాణకవిసింహులును, నన్నయభట్టారకాది త్రిలింగకవిపుంగవులును, గంభీరము లగు నిజకవితాగుంభనములచే లోకమును ఆనందకందళితముగాఁ జేసియున్నారు వీరి కవితల కిట్టిప్రతిభ వచ్చుటకుఁ గారణ మేమి? మఱేదియును లేదు. వారికవిత్వములు శాస్త్రమర్యాదలతో నలరారుచుండుటయే.

మర్యాదాభాసితమగు సాహిత్యకల అనిర్వచనీయానందమును సమకూర్చుచుండ కొందఱు నవ్యసాహిత్యవాదులు శబ్దానుశాసనాదిసంస్కారములు వాక్స్వాతంత్ర్యమును నిరోధించి, సౌకర్యార్థబోధ కడ్డుతగిలి, జనసామాన్యమును సాహిత్యరసాస్వాదనమునుండి దూరముగాఁ దఱిమివేయుచున్నవని, కోలాహలము చేయుచున్నారు వీరివాదము అర్థవిరహితమగు నాదము కాని భావసుందరమగు సిద్ధాంతము కాదు. కారణ మేమన, పద మాగమమర్యాదాభాసిత మయినపుడే అక్లేశముగా నాదపదార్థభావముల వ్యక్తముచేయఁగలుగును గాని, శాస్త్ర సంస్కారచ్యుతమైననాఁడు కాదు. ఈవిషయము శబ్దతత్త్వవేది యగు పతంజలిమహర్షి మహాభాష్యమున శబ్దానుశాసనప్రయోజనముల నిరూపించుపట్లు "రక్షోహాగమలఘ్వసందేహాః ప్రయోజనాని" అని అయిదుప్రయోజనములఁ దెలిపి, లఘుప్రయోజనమును వివరించుచు, నిట్లు తెలిపెను. "నచాంతరేణ వ్యాకరణం

లఘు నోపాయేన శబ్దాః శక్యావిజ్ఞాతుం” అనఁగా వ్యాకరణ ములేనిదే శబ్దార్థజ్ఞానము సుకరముగాఁ గలుగనేరదని భావము. ఈపై ప్రయోజనభాష్యమునకు వివరణము వ్రాయుచు గయ్యటుఁ డిట్లు నుడివియున్నాఁడు “లాఘవేన శబ్దజ్ఞాన మస్యస్య ప్రయో జనం” అనఁగా దీనికి (వ్యాకరణశాస్త్రమునకు) లఘూపాయ ముచే శబ్దజ్ఞానమును కలిగించుట ప్రయోజనము- అని భావము.

వేగిరపాటు వీడి, ఓర్పుతోఁ దిలకించిన, కళలకు శాస్త్రీ యసంస్కారములు వన్నెనుదెచ్చు కట్టుబాటులు కాని, కళా సౌభాగ్యముల దహించుటకుఁ గట్టఁబడిన కట్టియకట్టలు కావు. ఇట్టినీమములు లోకమునఁ గల నాగరభాషల కన్నిటికిని కలవు కాని, యీదారుణవ్యాకరణాదిదావానలదాహ మొక్కత్రిలింగ భారతికే సంప్రాప్తము కాలేదు. “నాగరకతకు ప్రధానలక్ష ణము నియమపాలన మగుటవలన నాగరులభాష నియమబద్ధమై యుండవలెను” అని షడ్భాషాతత్త్వవేత్తలగు శ్రీ జయపురా ధీశ్వరులు ఆంధ్రసాహిత్యరజతోత్సవసమయమునఁ దమయధ్య క్షోపన్యాసమున సెలవిచ్చియున్నారు.

పెక్కేల? ప్రకృతిసిద్ధములగు వస్తువులకు నానందాను కూలములగు చక్కనిసంస్కారముల సమకూర్చి, వాడుకొను టయే మానవస్వభావము. మానవేతరజీవుల కట్టిసంస్కార నైపుణ్యము లేదు. మానవులు నివసించుగృహములు, ధరించు వస్త్రములు, భుజించునాహారములు లోనగునవియన్నియు

సంస్కారసుందరములే. అటులనే భాషనుగూడ నోటికివచ్చిన ట్లుచ్చరింపక, దానికిఁ దగు వ్యాకరణాదిసంస్కారసంపదను సమకూర్చి, సాహిత్యమున వాడుటయే ప్రాజ్ఞతాలక్షణము. కట్టుబాట్లఁ ద్రెంచి, కవితావాహినిని బ్రవహింపఁజేయరాదు.

"బంధములఁ ద్రెంచుకొని లోకమందుఁ జేరి
యిచ్చవచ్చినతెఱఁగున విచ్చలవిడి
గా నడాడువాని కెచటఁ గానఁబడును
చిత్తశాంతి యతేంతగాఁ జెడునుగాని."

అని శ్రీ కాశిరాజు రామమోహనశర్మగారు కదంబ మను గ్రంథమున, మర్యాదోల్లంఘనము చెఱుపునకుఁ గారణ మని చక్కఁగ బోధించిరి.

కావున నానందసాధన మగుసాహిత్యమున సంస్కార శోభిత మగుభారతినే వాడుట న్యాయము. ఈమర్యాద పూర్వం పుకవులచేఁ జక్కఁగఁబాలింపఁబడినది. అందుచే వారికవితలు శాశ్వతములై, నిత్యనూతనములై, అసదృశానందము నందఁ జేయుచున్నవి.

అట్టికట్టుబాట్లక్కఱలేదన్నచో వ్యావహారిక భాషలోని తనఖాపత్రములు, ప్రాంసరీనోట్లు, అద్దెచీట్లు మొదలగునవికూడ కైతలేకావలసివచ్చును. వీనినిగూడ సాహిత్యసారస్వతమున జమకట్టుచో——

శ్లో॥ ఇతరపాపఫలాని శతాని వా
విలిఖ తాని సఖే చతురానన
అరసికాయ కవిత్వనివేదనం
శిరసి మా లిఖ మా లిఖ మా లిఖ।

అను శ్లోకమును పఠియించుచు మాఱుమాఱు ఁటాడకుండుటయే మర్యాద.

ప్రకృతిసౌందర్యనిర్మాణనిపుణుఁ డగు నలినభవుఁడును, కృతిసౌభాగ్యరచనాచతురుఁ డగు కవివరుఁడును, నిజసృష్టివైభవములచే లోకమునకు సమకూర్చు ప్రమోద మసదృశము. విరించి ప్రాక్తనవిజ్ఞానానుసారమే ప్రకృతిని సృష్టించుచున్నాఁడు. "ధాతా యథాపూర్వ మకల్పయత్" అని వేదము తెల్పుచున్నది. కవిబ్రహ్మయు పూర్వపువిధుల నాధారముగాఁ జేకొని, సాహిత్యనిర్మాణముల సాగించుచున్నాఁడు. "నానృషిః కురుతే కావ్యం" అని తెలుపఁబడినది "ఋషిః శాస్త్రద్రష్టా" అని నిరుక్తము. అనఁగా శాస్త్రావలోకనచతురుఁ డగుకవి కావ్యమును సృష్టింపఁగలఁడు కాని, శాస్త్రజ్ఞానము లేనివాఁడు సమర్థుఁడు కాఁజాలఁ డని భావము.

## సాహిత్యశక్తి.

కవిచంద్రుఁడు సాహిత్యవీథిని ప్రసరింపఁజేయు కవితాకౌముదీవికాసము అనన్యసాధ్యము; అసమానరససుధాపూరితము; అపూర్వానందసంధాయకము. కనుఁడు: మృతుఁడైన

సుతునిఁ దొడపై నిడుకొని, ఆ హతసుతముఖావలోకనముచే హృదయము కరఁగి, నీరై కనుఁగొనలనుండి ప్రవహింప బొరు మని విలపించుచున్నతల్లినిఁ గాంచినవా రెంతటిపాషాణహృద యులైనను, కంటఁ దడివెట్టుదు రే కాని సంతసింప మొదలిడరు కదా ?

ఆదృశ్యమునే కవివరుఁడు కావ్యమునఁ జిత్రించినచో లోకులు కరుణరసానందసాగరము న నోలలాడుదురు కాని రోద నము సేయనారంభింపరు. హరిశ్చంద్రోపాఖ్యానమున చంద్రమతి పాముకాటుచేఁ బ్రాణములఁబాసిన ముద్దుబిడ్డను తొడపైనిడు కొని, దుఃఖించినఘట్టమును నటుఁడు నాటకరంగమునుండి రసానుకూలమగురాగముతోఁ బఠించునపుడు సామాజికులచిత్త ములు ఆనందపరవశములు కాకుండునా ? కనుఁడు:

"అకటా చేరెఁడు నేలకుం దగఁడె సప్తాంభోధివేష్టీభవ
త్సకలద్వీపకలాపభూపమకుటాంచత్పద్మరాగోజ్జ్వల
త్ప్రకటానర్గళనిర్గళత్కిరణశుంభత్పాదుఁ డైనట్టిరా
జకుమారుండనియేడ్చెఁ గన్నుఁగవ నశ్రుల్గాల్వలై పాఱఁగన్."

(శంకరకవి.)

ఇట్టివిచిత్రమగు మోహనసృష్టి చతుర్ముఖనిర్మాణమునఁ జూపట్టదు. ఇటులనే రసరహస్యవేత్తలగు కవితల్లజులు శృంగా రాదిరసముల సభ్యముగాఁ జిత్రించి, లోకుల కపూర్వసుఖాను భూతిని జేకూర్చుచున్నారు.

శ్రుతిసుందరములగు నాదములతోడను, మనోరంజకములగు సర్థములతోడను, ఆత్మానందజనకములగు భావములతోడను, అలరారు కావ్యరాజములు సంసారుల దుఃఖకూపమునఁ బడకుండఁ గాపాడి, ఆనందమేరుశిఖరముపైకిఁ గొంపోవుచున్నవి. ఈసంగతి నీక్రిందియభియుక్తోక్తి వ్యక్తముచేయుచున్నది.

శ్లో॥ సంసారవిషవృక్షస్య ద్వే ఏవ రసవత్ఫలే
కావ్యామృతరసాస్వాదః సంగమః సజ్జనైః సహ॥

అనఁగా సారదూరమగు సంసారమును సంతోషసాగరమునుగా మార్ప సమర్థములగు పదార్థములు రెండు. అందు మొదటిది సత్కావ్యరసపానము; రెండవది సజ్జనసహవాసము-అని భావము.

సాహిత్యనిర్మాణము సామాన్యకార్యము కాదు. ఈయది బహుళాయాససాధ్యమగు కలావిన్యాసము. వేల్పు లుప్పునీటిని దఱచి అమృతము నుత్పత్తిచేసినట్లు, కవివిబుధులు వాడుకభాషను చిలికి సాహిత్యసుధను సమకూర్చినారు

వ్యావహారికవాణి అమేయమగు లవణార్ణవవారివలె సహజసిద్ధము. సాహిత్యభారతియన్ననో? శ్రమగొని, చిలికినవెన్నముద్దవలె హృద్యగల శబ్దసముదాయము షట్పదము లుద్యానవాటికలలోని వివిధములగుసుమమంజరులనుండి మకరందమును సంగ్రహించి, తేనెపట్టులోఁ జేర్చునట్లు కవిభృంగములు వాఙ్మ

యమునందలి సాహిత్యప్రసూనములనుండి రససుధను గ్రహించి, కవితాకోశములలో సమకూర్చును. కాని యీకూర్పునందుఁ బైచేర్పునకంటె విలక్షణమగు నేర్పు కలదు.

మధుపములు అలరులనుండి కేవలస్వార్థపరతతోనే తేనెను గ్రహించుచున్నవి కాని, పరానందసంధానపరాయణతచేఁ గాదు. కవిచంచరీకము లన్ననో? ఆత్మతృప్తికొఱకును, పరానందముకొఱకును, సాహిత్యమకరందమును సమకూర్చును.

సాగరమున సకలవాహినీరసములు లీనమగునట్లు సాహిత్యమున సకలకలాసారములు లయమగును. కావున సాహిత్యోపాసకునకు అక్లేశముగా నొక్కతావున సకలకలావలోకనానందము సమకూరును. సాహిత్యసుధారసమును మించినమధురపదార్థము వేఱొకటి లేదు. కావుననే పండితు లిట్లు తెలిపియున్నారు

శ్లో॥ శ్రుత్వాఽమృతమయీం వాణీం సాహిత్యార్ణవసంభవాం
సంలజ్జితా సుధాయాతా దివం కలశగూహితా॥

అనఁగా సాహిత్యసుధామాధుర్యము నాకర్ణించి, అమృతము సిగ్గుచెంది, రహస్యముగా దివమునకు దాఁటిపోయె నని భావము. మఱియు,

శ్లో॥ సుధామాధుర్యతో రమ్యాం రామాయణసర్వతీం
పాతుమవాతరం లోకే దేవా వానరతాం గతాః॥

అనఁగా అమృతముకంటెను మధురతర మగు రామాయణకవితామాధుర్యమును ఆస్వాదించుకుతూహలముతో దేవతలు వానరరూపధారులై, భూలోకమున నవతరించి రని భావము. ఇందుచే సాహిత్యమాధుర్యము మర్త్యులకేకాక, అమరులకుఁగూడ నానందజనక మగుచున్న దని భావము.

సాహిత్యతత్త్వమునుగూర్చి శ్రీ మాధవవర్మగారు ప్రతిభలో నేమి తెలిపిరో కనుఁడు. "సాహిత్యములో ఆత్మధర్మములు ఆనందము సుభాసనముతో అవతరించినవి. హృదయధర్మములకు సాహిత్యములో వికాసము ఉన్నది. సాహిత్యసరణిని అనుసరించిన సహృదయుఁడు తనహృదయతంత్రులన్నీ సమరసములై అనాహతముగా ఆనందగానమును చేయుటకు భావించఁగలుగుతాఁడు" ఇట్లు సారస్వతప్రభావము బహువిధములుగా ప్రస్తుతింపఁబడియున్నది.

## —♦ రూ ప క ప్ర శం స. ♦—

లోకమునఁగల సుఖసాధనములలో నుత్తమసాధనము సత్కావ్యమే యనియు, ఈయది దినదినాస్వాదితమయ్యు స్వల్పమయినను రుచి తగ్గక, ఒక్కరీతిని ఆనందమును సమకూర్చుచుండుననియు, ననుభవజ్ఞులగు విద్వాంసులు నిరూపించియున్నారు. ఇట్లు లోకకళ్యాణానందసంధాయక మగు సాహిత్యము దృశ్యశ్రవ్యభేదములచే ద్వివిధముగా విభాగింపఁబడినది. శ్రవ్య

మన వినుటచే నానందము కలిగించునది. ఇందు రామాయణ, రఘువంశాదికావ్యములు చేరును. దృశ్య మనఁ జూచుటచే సంతోషమును సమకూర్చునది. దీనియందు శాకుంతల, మాలతీమాధవాదులు చేరును.

శ్రవ్యకావ్యములకంటె దృశ్యకావ్యములు అధికప్రమోదావహములు. కారణ మేమన, శ్రవ్య మొక్క శ్రవణద్వారముననే సంతోషమును సమకూర్పఁజాలును. దృశ్యమన్ననో ? నాటకరంగమున రామాదివేషధారుల రూపాభినయాద్యవలోకనమువలనను, రాగసుందరముగా నటుఁడుపఠించు గద్యపద్యాదుల వినుటచేతను, ఒక్కసారి నేత్రశ్రోత్రోభయద్వారమునను ఆనందము నతివేగముగా సామాజికుల కందఁజేయును.

కథాభాగముల వినుటకంటె వానిని బ్రత్యక్షముగాఁ జూచుటచే విషయము సుబోధమై అధికామోదము సమకూరును. ఈయది లోకానుభవసిద్ధమే.

మఱియు శ్రవ్యకావ్యప్రబోధములచేఁ దెలుపశక్యము గాని క్లిష్టవిషయముల దృశ్యకావ్యప్రదర్శనములచే ననాయాసముగా బోధింపవచ్చును. పూర్వము కీర్తివర్మ యనుభూపాలునకు వేదాంతశ్రవణాసక్తి కలిగి, పండితులవలన వేదాంతతత్త్వమును వినుటకు ప్రారంభించెను. కాని యెంతకాలమునకును ఆరాజునకు శ్రవణముచేఁ దత్త్వము అవగతము కాదాయెను. అందువలన నానృపాలుఁడు ఖిన్నుఁడై యుండ, ఆమహాత్మా

జ్ఞానసకవి యగు కృష్ణమిశ్రుఁ డనుపండితకవి ప్రబోధచంద్రోదయ మనునాటకమును వ్రాసి, అందు కామక్రోధాదులను, శమదమాదులను, పాత్రములనుగాఁ జిత్రించి, కీర్తివర్మయెదుట నటులచేఁ బ్రదర్శింపఁజేసెను. ఆనాటకమునఁ బ్రత్యక్షమైన పాత్రల నవలోకించుటవలనను, వారిసంభాషణముల నాకర్ణించుటవలనను, రాజునకు ననాయాసముగా వేదాంతతత్త్వము బోధపడెను.

కావునఁ దేలికగా విషయమును బోధించుటకు రూపకము లెక్కుడుసహాకారము లనుట అతిశయోక్తి కాదు. కాని శ్రవ్యకావ్యముల వ్రాయుటకంటె దృశ్యకావ్యములఁ జిత్రించుట కష్టతరము. కావుననే "నాటకాంతం కవిత్వం" అనుపండితోక్తి ప్రసిద్ధమైయున్నది.

అనఁగా కవి, కవిత్వమున సుప్రసిద్ధుఁ డగుటకుఁ నాటకనిర్మాణప్రావీణ్యమే కారణము- అని భావము. సాహిత్యలోకమునఁ జూపట్టురచనలో రమ్యతమమగునది రూపకమే. కావుననే "కావ్యేషు నాటకం రమ్యం" అని విద్వాంసులు తెలిపియున్నారు.

రూపకనిర్మాణము శ్రవ్యకావ్యరచనవంటిది కాదు. శ్రవ్యకావ్యమునఁ గథాప్రకటనమునకుఁ గావలసినరసపోషణముండినఁ జాలును. దృశ్యకావ్యమున అట్లు కాదు. ఇతివృత్తమునందలి స్త్రీపురుషాదిపాత్రములయొక్క హావభావముల, రసో

చిత మగు నభినయములతో నటులు రంగమునఁ బ్రదర్శించుట కనువగు రీతుల వ్యక్తము సేయవలయును. శ్రుతిసుఖదములగు గద్యపద్యరచనలఁ జిత్రింపవలయును. అందుచే నాటకనిర్మాత అధికమేధావంతుఁ డైనఁగాని రంగానుకూల మగురూపకమును వ్రాయఁజాలఁడు.

మనపూర్వులు చిరకాలానుభవముచే రూపకరచన యేరీతినున్న మనోహరముగా నుండునో యోజించి, రూపక రూపముల విభజించి, దృశ్యకలపైఁ జక్కని గ్రంథములఁ బ్రక టించియున్నారు. వానిననుసరించి, నాటకములు వ్రాసిన మనో హరముగా నుండును.

ఇపు డీనవ్యసాహిత్యయుగమున రచింపఁబడు సాంఘిక రూపకములును, పురాణకథానాటికలును, ప్రాచీనరూపకలక్ష ణములకు విరుద్ధముగా బయలువెడలుచున్నవి. నవ్యులు సంహి తలో సంధినియమములఁ బాటింపనటులనే, రూపకమున సంధు లను నిర్లక్ష్యము చేయుచున్నారు. మఱియు రూపకరంగమునఁ జూపఁగూడ దని నిషేధింపఁబడినవిషయములనే ఏమఱుపాటు వీడి, మాటిమాటికిఁ జూపుటయు, ప్రదర్శింపఁదగుగుణముల విసర్జించుటయు నవ్యనాటకములఁ గాననగును.

ఇంతియకాదు- శాస్త్రీయము లగుకట్టుబాట్లను కంఠ పాశములనుగా భావించుచున్నారు. శాస్త్రవిధుల నతిక్రమించి

వ్రాయుట శోభావహము కాదని, సహేతుకముగా బోధించు వారిని గేలి సేయుచున్నారు. కనుఁడు:

"పూర్వాచారపరాయణత్వ మనుపెన్భూతంబు మాపృథ్విపై
సర్వవ్యాపియు బ్రహ్మరాక్షసియు నై స్వాతంత్ర్యముఙ్గంపి యీ
యర్వాచీనులకెల్లఁ బూర్వమతదాస్యం బిచ్చి, మాదృష్టి మా
పూర్వావస్థల నిల్పి ముందుగతికిన్ బోనీయ దో భారతీ!"

(శ్రీ గిడుగు సీతాపతిగారు- ప్రతిభ.)

శ్రీ తుమ్మల వేంకటరామయ్యగారు వైధవ్యబ్రతుకులో సనాతనగ్రంథముల నిరసించుతలంపుతో నీక్రిందివాక్యములఁ జిత్రించియున్నారు.

"నామగోవిందాలుతప్ప ప్రేమగీతాలు పేరెత్తరాదు. బూజుపట్టిన పురాణాలుతప్ప నాజూకుఖండకావ్యాలు చదువ రాదు."

(చిత్రగుప్త.)

ఇట్లు పీ రెంతటిమడుకువ్రాఁతల వ్రాయుచున్నను సోదరులకు హిత ముపదేశించుటయే ఆర్యపురుషలక్షణ మగుటచే ఇట్టివిషయముచుగూర్చి వ్రాసితిని. కావున నవకవిసోదరులు సంఘశ్రేయోభిలాషులై, మర్యాదాకలితము లగురూపకకల్పనముల నొనర్చి, ఆంధ్రదేశమునకు గౌరవానందముల సమకూర్తురుగాక.

## —♦ వస్తుప్రశంస ♦—

సాహిత్యమునకు నాదపదార్థభావములేకాక, పావనమగు కథాసంవిధానముకూడ ముఖ్యము.

"ఉత్తమశ్లోకచరిత ముదాహరణ మర్హతి" అని విద్యానాథుఁడు తెలిపియున్నాఁడు. మఱియు,

"ప్రఖ్యాతం బితివృత్త మైనకృతి సెప్పన్ వక్తకున్ శ్రోతకున్
విఖ్యాతి న్గలిగించుఁ బుణ్యమహిమన్విశ్వంభరామండలిన్"

అని పిల్లలమఱ్ఱి పినవీరభద్రుఁడు తెలిపియున్నాఁడు.

కావునఁ గావ్యమునందలి యితివృత్తము పాఠకమానసములయం దుదారభావము లుదయింపఁజేయునదిగా నుండవలయును. పరిశుభ్ర మగు నాహారగ్రహణ మెట్లు రక్తమును బాగుసేయునో, అటులనే యుత్తమకథాశ్రవణము చిత్తమును బాగుసేయును. కథావిన్యాస మెట్లుండవలయునో వేదవ్యాసమునీంద్రుఁడు భాగవతమున ధ్వనింపఁజేసియున్నాఁడు.

శ్లో॥ బ్రహ్మన్ విష్ణుకథాః పుణ్యా మాధ్వీ ర్లోకమలాపహాః
కో ను తృప్యేత శ్రుణ్వానః శ్రుతజ్ఞో నిత్యనూతనాః॥

అనఁగా శ్రుతిసుఖములును, పరమపావనములును, పాపహారములును, నిత్యనూతనములును, అగువిష్ణుకథలను వినుటకు విసుగుచూపు వెంగలి యుండునా? అని భావము. దీనిఁబట్టి చూడఁ గావ్యమునందలికథ ఉత్తమనాయకాశ్రయమై, మాధు

ర్యకలితమై, పావనభావసుందరమై, పాపహరమై, నవనవోన్మేషమై యుండవలయు ననుభావము ధ్వనింపఁజేయఁబడినది.

సుగుణాలంకృతము లగు కథాసంవిధానములు పురాణ సారస్వతమున అతిమనోహరముగా వర్ణింపఁబడియున్నవి. అందుచే దేశహితసంపాదనకుత్సాహులు రగు సోదరీసోదరులు కొంచె మోపికతోఁ బురాణవాఙ్మయమును పరికింపవలయును. పురాణసారస్వతమునందలి వివిధరచనలును, చదువరులకుఁ దాత్కాలికానందము నందఁజేయుటయేగాక, కామాదిదుర్గుణ దూషితము లైనమానసముల సంస్కరించి, శీలభాసురము లగునటులఁ జేయఁజాలియున్నవి.

కొన్నగనే మహాత్ములకుఁ బిమ్మటఁ గాళిదాసాదికవివరులు సామాన్యముగాఁ బురాణనాయకజీవితములనే ఇతివృత్తము లుగాఁ దీసికొని, రసభరితము లగు కావ్యముల విరచించియు న్నారు. పరమపావనచరితు లగు నాయకులజీవితములఁ జదువు టచేఁ గలుగులాభములకు మేర లేదు. "జాతీయవీరచరితములఁ జెప్పు గ్రంథసముదాయము సమస్తకాలములందును, సమస్తదేశములందును, నిక్కమైన విద్యకును, సౌశీల్యమునకును, మూలాధారము" అని మహామాన్యపండితుఁడు జాతీయవిద్యా వ్యాసమున వ్రాసియున్నాఁడు.

పురాణవర్ణితము లగు గజేంద్రాదితిర్యగ్జంతువులయొక్కయు, ప్రహ్లాదాదిబాలభాగవతోత్తములయొక్కయు, అభిమన్యు

ప్రభృతియువకవీరులయొక్కయు, అర్జునాదిప్రౌఢశూరులయొక్కయు, సిబ్యాదిదానశౌండులయొక్కయు, హరిశ్చంద్రాదిసత్యరతులయొక్కయు, శ్రీరామాద్యేకపత్నీవ్రతులయొక్కయు, విదురాదినీతిధౌరేయులయొక్కయు, భీష్మాదిత్యాగగరిష్ఠులయొక్కయు, పావనచరితలగు సావిత్రి, దమయంతి లోనగు సాధ్వీలలామలయొక్కయు, పవిత్రనామములు విన్నమాత్రముననే శరీరము పులకరించుచుండ, వారి యుదారధర్మజీవితములఁ జదువునపుడు ఏయార్యకుమారునిచిత్తము సంతోషభరితము కాకుండను? ఏభారతసోదరీమణినేత్రములనుండి ఆనందాశ్రుబిందువు లొలుకకుండును?

ఐహికసౌఖ్యముల సమకూర్చు విజ్ఞానచంద్రికయు, ఆముష్మికానందము చు ప్రత్యక్షముసేయు వివేకభానుతేజమును, పురాణావలోకనమున సమకూరఁగల వని ప్రాజ్ఞులు ప్రకటించి యున్నారు.

శ్లో॥ ఆయుష్య మారోగ్యకరం యశస్యం
సౌభ్రాతృకం బుద్ధికరం శుభం చ
శ్రోతవ్య మేత న్నియమేన సద్భి
రాఖ్యాన మోజస్కర మృద్ధికామైః॥

ఈశ్లోకము పై భావమును వ్యక్తము చేయుచున్నది.

నిక్కమగు సనాతనభారతజాతీయతను దర్శింపఁగోరువారు పురాణసారస్వతమును తప్పక పఠింపవలయును. ఇతర

సారస్వతమున భారతజాతీయత చక్కఁగా వ్యక్తము కానేరదు. "గృహోపకరణములు ఒకయింటినుండి వేఱొకయింటికి మార్చునట్లు జాతీయపరమావధులు ఒకజాతినుండి వేఱొకజాతికి మార్పఁదగినవి కావు" అని కుమారస్వామిపండితుఁడు నుడివి యున్నాఁడు.

భారతీయయువతీయువకుల క్షేమంకరమగు జాతీయాదర్శక్షేత్రమునకుఁ గొంపో నభిలషించునెడల పురాణచిత్రితములగు పావననాయకజీవితముల వారిచిత్తదర్పణములందుఁ బ్రతిబింబింపఁజేయవలయును. అట్లుచేయక యుపేక్షించుచో మన మపేక్షించుమనోరథ మీడేఱనేరదు.

## శీలప్రశంస.

సాహితీకాంత సుగుణాలంకృతగా నుండవలయును గాని పేలవజీవితోపేతగా నుండరాదు. ఏలయందురా? కాసారమునకు రాగసౌరభసుందరమగు పద్మినీసౌభాగ్యమట్లు సంసారమునకు శీలానురాగభాసిత మగుసంతతి భూషణము. కావునఁ గవివరులు నిజసాహిత్యరచనలయందు శీలసంపదలఁ బొందుపఱుపవలయును. నీతిని బాసినజాతియు, కాంతిని వీడినవత్తియుఁ బ్రకాశవంతములు కానేరవు.

"నీతి లేనివాని నిందింత్రు లోకులు
లేదు సేగి లాతి లేకయున్నఁ

గాన మానవుండు పూనిక నయవిద్య
గడనసేయ మొదటఁ గడఁగవలయు."

అని భారతము ఘోషించుచున్నది. మఱియు శీలసంప దనుగూర్చి భర్తృహరిసుభాషిత మిట్లు బోధించుచున్నది.

చ. అతనికి వార్ధి కుల్య యగు, నగ్ని జలం బగు, మేరుశైల మం
చితశిలలీల నుండు, మదసింహము జింక తెఱంగుదాల్చుఁ, గో
పితఫణి పూలదండ యగు, భీష్మవిషంబు సుధారసం బగున్
క్షితి జనసమ్మతం బగు, సుశీల మదెవ్వనియందు శోభిలున్.

నిజముగా అజ్ఞానతిమిరము నడంచి, నీతిసంపదను ప్రత్యక్షముసేయునది సత్కావ్యభానుమండలమే.

శ్లో॥ ఇద మంధంతమః కృత్స్నం జాయతే భువనత్రయం
యది శబ్దాహ్వయం జ్యోతి రాసంసారం న దీప్యతే॥

అని దండియు, "ఇయా న్విశేషః కావ్యాత్ కర్తవ్యతాధీః సరసా అన్యత్ర న తథా" అని విద్యానాథుఁడు వివరించి యున్నారు.

అనఁగా సారస్వతకాంతి లేకున్నఁ జీఁకటి ముల్లోకముల ముంచివేయు ననియు, కర్తవ్యతాజ్ఞానమును గావ్యము కలిగించు రీతిని సరసముగా వేఱొకటి గలిగింపనేర దనియు భావము.

జనులచిత్తవృత్తులకుఁ గ్రొత్తపరివర్తనముల రేకెత్తించుటలోఁ గావ్యరాజముల కున్నశక్తి రాజశాసనములకుఁగూడ

లే దనవచ్చును. మానవమానసవికసనమునకుఁ గవనమే ప్రధాన సాధనము. సందియము లేదు.

శ్లో॥ పరివడ్ఢ ఇ విణ్ణాణం సంభావిజ్జ ఇజసో విసప్పందిగుణా
సువ్వఇసు పురుసచరిఅంకింతజ్జేణ ణహరంతికవ్వాళావా॥

అనఁగాఁ గావ్యరసాస్వాదనముచే విజ్ఞానము సమృద్ధమగును, యశ మభివృద్ధ మగును, సుగుణములు వ్యాప్తి నొందును, సుచరితము విదిత మగును. కావ్యాలాపములు దేనిని సమకూర్పనేరవు? అని భావము.

## —♦ స్త్రీవిద్యాప్రశంస ♦—

కావ్యములయందు విద్యావైభవోపేత లగు మాతల జీవితములఁ జక్కఁగా వర్ణించుటయు నవసరమే. కారణ మేమన, మానవసంఘమును తేజస్సంపన్నముగాఁ జేయుటకుఁ బ్రధాన సాధనము వివేకము. అట్టివివేకమున కునికిపట్టు విద్య. విద్య కుత్పత్తిస్థానము ఆచార్యుఁడు. కావున మానవవివేకోదయమున కుపాధ్యాయుఁడు ఆదిమకారణ మనుట నిశ్చయము. అట్టివిజ్ఞాన ప్రదు లగుదేశికులలో ముఖ్యులు మువ్వురు.

శ్లో॥ పురుష స్యేహ జాతస్య భవంతి గురవ స్త్రయః
ఆచార్య శ్చైవ కాకుత్స్థ పితా మాతా చ రాఘవ॥

(రామాయణమున వసిష్ఠోక్తి) అనఁగా మాత పిత ఉపనేతలు పురుషునకు గురువు లని భావము.

వీరిలో మాత యగ్రగణ్య. ఎందుచే ననఁగా, తల్లి పిల్లలకు విజ్ఞాన మందించుటలోఁ జూపు నేర్పోర్పులు తక్కిన వారికడఁ జూపట్టవు. తల్లి తనయుల చిత్తపరివర్తనములఁ బరిశీలించి, సమయానుకూలముగా విజ్ఞానము నందఁజేయుచుండును. బుడుతలదుడుకుచేఁతల కుడికి, విసుగుఁజెంది, కసరుటగాని, యుపేక్షించుటగాని కానరాదు. తర్జనభర్జనాదులచే బాలుర భయభ్రాంతులనుగాఁ జేయదు.

పెక్కేల? ఆచార్యకమున అగ్రస్థానము సతీమణులకే సమర్పింపవలసియున్నది. వీరిబోధలకుఁ గలసహజమాధుర్య లాలిత్యములు ఇతరులయుపదేశములకుఁ జూపట్టవు. కావుననే "కాంతా సమ్మిత తయా ఉపదేశయుజే" అని మమ్మటాచార్యుఁడు తెలిపియున్నాఁడు. అనఁగా కావ్యబోధలు కాంతా ప్రబోధములవలె ఉపదేశార్హములు- అని భావము.

ఆరోగ్యశాఖామంత్రిణి శ్రీమతి విజయలక్ష్మీపండిట్ గారిట్లు తెలిపిరి. "పిల్లలకు గుణముల నేర్పు బాధ్యత స్త్రీదే"

(గృహలక్ష్మి.)

"స్త్రీలు సన్మార్గమునఁ బ్రవర్తించుచు, సత్కాలక్షేప మొనర్చుచు, విశుద్ధచరిత్ర లగుచో వారి పిల్లలును విశుద్ధచరిత్రు లగుదురు."

(శ్రీ చంద్రశేఖరేంద్ర సరస్వతీ యతీంద్రులు- విజయయాత్ర.)

నిజమే; సుమమంజరులకు సువాసన నైసర్గిక మైనట్లు ౘవిదల కుపదేశనైపుణ్యము నిసర్గప్రాప్తము. అట్టి సహజబోధ

కతాకలిత లఘుమాత్రలు వినుమీలలామ లగుచో బాలు రెంత
వేగముగా నభివృద్ధిలోనికి వత్తురో వేఱుగఁ దెలుపవలయునా ?
స్త్రీవిద్యనుగూర్చి సంగనోల్లాసమున నిట్లు వర్ణింపఁబడియున్నది.

చ. ఇహపరసౌఖ్యహేతు వగు నింతులకున్ బతిభక్తి దానికిన్
మహితవివేకసంపద ఘనంబగు కారణ మౌను దానికిన్
సహజవిమూఢతం గెడపునట్టి సువిద్యయె ముఖ్యమూలమై
మహి నలరొందెఁ గాన నది మానినికిం దగు నభ్యసింపఁగన్.

(దేవులపల్లి వేంకటకృష్ణకవిగారు.)

ఇఁక సతీలలామలు నేర్వఁదగినవిద్య యెట్టిదిగ నుండవలయు నన, నవిద్యచే నిజదేశగౌరవసంపద పెంపొందునో, ఏవిజ్ఞానముచే శౌర్యాబాల్యావిమలగుణములు వికాస మందునో, ఏవివేకముచే జగదీశ్వరభక్తి సంప్రాప్త మగునో, ఏ తెలివిచే ఆత్మగౌరవకాంతి ప్రకాశించునో, ఏభాషచే నీతిలతిక యెసఁగందునో అట్టివిద్య నుపదేశింపవలయును అంతియకాని, నిజదేశసంపదల మాపుసేయుచున్న దాని.

శ్రీ వివేకానందస్వామివారి హితోపదేశముల నాలింపుఁడు. "స్త్రీవిద్యవిషయమున బాశ్చాత్యస్త్రీల కిచ్చెడు విద్యవంటి విద్యయే మాస్త్రీల కిప్పించినయెడల మీరు కేవల మజ్ఞులగుదు రని మీరు చెప్పవలసియుందును."

(సనాతన ధర్మోపన్యాసము.)

మఱియు ఆర్యనారీమణులకు దేశభాష నేకాక, సంస్కృతవిద్యనుగూడ నభ్యసింపవలయును. భారతీయవిజ్ఞానసౌభాగ్య

మంతయు సంస్కృతవాఙ్మయమున నిండియున్నది. దేశ భాష లందు దానిఛాయాబింబము కాననగును గాని జీవకళాకలిత మగునిజరూపము గోచరము కాదు. కావున బాలికలకు సంస్కృతము నేర్పుటకూడ ముఖ్యవిషయము.

ఇంతియకాదు; సోదరీమణులకు విద్యలతోపాటు పాతి వ్రత్యాభిరుచినిగూడఁ బెంపొందించు సాహిత్యము నందఁజేయ వలయును. భారతవర్షము సతీత్వమున అనన్యదుర్లభ మగు ప్రత్యేకవ్యక్తిత్వమును సమకూర్చుకొని యున్నది. సాంఘిక కళ్యాణసౌధనిర్మాణమునకు సతీధర్మము గొప్పపునాదిగా నున్న యది. ఇ దెంతగట్టిగానున్న నంతశాశ్వతముగా దానిపై నిర్మిత మైన కళ్యాణసౌధము నిలిచియుండును.

అట్లుకానిచోఁ బునాదిసడలినమేడవలె నేలఁ గూలును. కావుననే వ్యాసమహర్షి యిట్లు ప్రబోధించియున్నాఁడు.

శ్లో॥ స్త్రీషు దుష్టాసు కౌంతేయ జాయతే వర్ణసంకరః
సంకరో నరకాయైవ కులఘ్నానాం కులస్యచ॥

అనఁగా స్త్రీలు పాతివ్రత్యవిరహిత లగుచో జాతి హాత మగు నని భావము. స్త్రీల ధర్మవర్తనమును గూర్చి, శ్రీమతి విజయలక్ష్మి పండిట్ గా రేమనిరో చూడుడు.

"స్త్రీయొక్క ధర్మవర్తనమే మనకు తుదకు విజయము చేకూర్చఁగలదు" (గృహలక్ష్మి.)

పాతివ్రత్యఘనతను వెల్లడించు నుపాఖ్యానము లెన్నియో భారతాదిగ్రంథములయందుఁ జక్కఁగా వర్ణింపఁబడి యున్నవి. అట్టిపావనోపాఖ్యానముల కథారూపముగను రూపకరూపము నను జిత్రించి, ఆంధ్రలోకమునకు అందఁజేయుట కవికుమారులకు ముఖ్యకర్తవ్యము.

అంతియకాని, పాతివ్రత్యమహిమలఁ బాడుచేసి, క్రొత్తరీతిని కవితల నల్లుట నిజదేశగౌరవాభిమానులకుఁ దగవుకాదు.

## —♦ క ళ త్ర ప్ర శం స ♦—

మానవుఁ డైహికాముష్మికానందసంపదల నందఁగోరుచో సుగుణభూషిత యగుసతీమణియొక్క కరమును గ్రహింపవలయును. కాంతి లేకున్న నేత్రభాగ్యము వ్యర్థ మగునటులఁ గులకాంత లేకున్నఁ బురుషసంపద నిరర్థక మగును. కావుననే పెద్ద లిట్లు తెలిపియున్నారు.

శ్లో॥ సంపన్నరమణీ లీలా సంపన్నరమణీం వినా
ఇత్యూర్థవాన్నరమణీ రమణీం రుక్మిణీం హరిః॥

అనఁగా సుగుణాలంకృత యగుకాంత చెంత లేకున్న పురుషసంపద సంపన్నము కాఁజాల దని భావించి, పురుషోత్తముఁ డగు శ్రీకృష్ణుఁడు రుక్మిణీరమణీమణిని బాణిగ్రహణ మొనర్చె నని భావము.

మఱియుఁ బురుషునకు బోఁటి సాటిలేనిభాగ్యపేటి యని భవభూతి చాటియున్నాఁడు. కనుఁడు:

శ్లో॥ అద్వైతం సుఖదుఃఖయో రనుగతం సర్వా స్వవస్థాసుయత్
విశ్రామో హృదయస్య యత్ర జరసా యస్మి న్నహార్యో రసః
కాలే నావరణాత్యయా త్పరిణతే యత్స్నేహసారే స్థితం
భద్రం ప్రేమసుమానుషస్య కథ మప్యేకం హి తత్ ప్రాప్యతే॥

అనఁగా నెయ్యది సుఖదుఃఖముల రెంటను జంటగా నంటియుండునో, ఏయది కలిమిలేముల నొక్కఫక్కిఁ దోడు నీడవై వెలయునో, ఎచ్చట వ్యాకులాయత్త మైనచిత్తమునకు శాంతిసంపత్తి సమకూరునో, దేనియందలి రసోత్కర్షమును ముదిమి ముదిరి, తుద ముట్టింపనేరదో, ఎక్కడ వరణము మొదలు మరణమువఱకు మక్కువ చెక్కుచెదరక యొక్క చాయఁ జూపట్టునో- అట్టిపావనానురాగామృతపాత్ర మగు కళత్రము ఎక్కడో, యెప్పుడో, ఒకపుణ్యపురుషునకు సంప్రాప్త మగు నని భావము

ఈపైశ్లోకమునకు ననుకరణమో యన్న ట్లున్న యీ పద్యమును వినుఁడు.

సీ. ధర్మార్థకామసాధన కుపకరణంబు
గృహనీతివిద్యకు గృహము విమల
చారిత్రశిక్ష కాచార్యకం బన్వయ
స్థితికి మూలంబు సద్గతికి నూఁత
గౌరవంబున కేకకారణం బున్నత
స్థిరగుణమణుల కాకరము హృదయ

సంతోషమునకు సంజనకంబు భార్యయ
చూవె భర్తకు నొంట్లు గావు ప్రియము
లెట్టిఘట్టములను నెట్టియాపదలను
నెట్టితీరములను ముట్టఁబడిన
వంత లెల్లఁ బాయు నింతులఁ బ్రజలను
నొనరఁ జూడఁ గనిన జనుల కెంచు. (భారతము.)

కాంతానురాగకౌముదీకాంతికలితునకు నిబిడాంధకారబంధుర మగుకాఱడవియైనఁ జంద్రికాసుందర మగునందనోద్యానముమాడ్కి ఆనందప్రద మగును. కనుఁడు:

శ్లో॥ కాంతారేష్వపి విశ్రామో జనస్యాధ్వనికస్యవై
యస్తు దారానుగో మర్త్య స్తస్మా ద్దారాః పరాగతిః॥

"అధికదుఃఖరోగార్తున కౌషధంబు
సురుచిరంబుగ భార్యయ చూవె యెందు
నొనర భార్యాసమేతుఁడై యున్నవాని
కెంత లాపద లయ్యును నెఱుకపడవు."

ఆపద లాసన్నమైనతోడనే ధైర్యోత్సాహములు సడలి, బెగడొంది యున్నమగల మనోహరము లగు నిజోపదేశనౌకలచే దుఃఖసాగరముల దాఁటించి, దరిఁజేర్చి, సంతస మొనఁగూర్చినసతీమణు లెందఱో భారతభూగర్భమున నుద్భవించి యున్నారు. ఈపూతజీవితలచరితము లెంతవిన్నను తనివి తీఱదు. ఎప్పటికప్పుడు క్రొత్తవై ఆనందామృతము నందఁజేయుచుండును.

శ్లో॥ ఆదిత్య స్యోదయం రాజన్ సువర్ణం భారతీః కథాః
సతీ భార్యా సుమిత్రంచ అపూర్వాణి దినే దినే॥

అని ప్రాజ్ఞులు ప్రకటించియున్నారు అనఁగా సూర్యోదయము, సువర్ణము, భారతకథలు సాధ్వి యగునిల్లాలు, సన్మిత్రుఁడు, నిత్యమంగళము లగుపదార్థము లనియు, వీని నెంత యనుభవించినను తనివి తీఱ దనియు భావము.

పడఁతి పతిని వీడి, సుఖములఁ బడయఁగోరదు. తన కెడమైయున్న యొడయుఁ డెట్టియిడుమలఁ బడుచున్నాఁడో యని యడలుచుండునుగాని, నిలుకడగా నిలువఁజాలదు కనుఁడు: అర్ధరాత్రమున నడవిలోఁ ద న్నొంటరిగ దిగవిడచి, వెడలి పోయిన నలునిఁ దలంచి, సాధ్వీమణి యగుదమయంతి యెట్లు తల్లడిల్లెనో వ్యాసుఁడు భారతమునఁ జిత్రించియున్నాఁడు.

శ్లో॥ న శోచా మ్యహ మాత్మానం న చాన్య దపి కించ న
శ్రాంతస్య తే క్షుధార్తస్య పరిమ్లానస్య నైషధ !
కః శ్రమం నరశార్దూల ! నాశయి ష్యతి మాం వినా॥

(భారతము.)

అనఁగా, ఓసుకుమారా ! హృదయేశ్వరా ! నన్నుఁ గూర్చికాని, నాదీనదశను దలంచికాని, నే శోకింపను. ఈభీకరారణ్యసంచారముచేఁ గడుం బడలి, యాఁకటిబాధకుఁ దాళఁజాలక, యవియుచున్న నిన్ను నే లేకున్నఁ గనిపెట్టువా రెవరు ? అని భావము.

ఓహో! ఈసాధ్వీమణియొక్క మానససరోవర మెంతటి వరానురాగనీరజపరిమళభరితమై యున్నదియో కనుఁడు! మణిమయసౌధాంతరముల హంసతూలికాతల్పములపై సంచరింప నర్హములగు మృదుతరపాదతలములు కంటకసంకటములగునటవీవీథుల నడయాడుటచేఁ గంది, పొక్కు లెక్కి యున్న మాటను మఱచి, ఎండవేఁడిమి యెట్లుండునో ఆవంతయు నెఱుంగని సుకుమారఫాలతలము మాధ్యందినాతపతాపముచేఁ గమలిపోవుటను పాటింపక, మగనిబాధల మదినిదలంచి, వాపోయెనే! ఇదికదా! ఆర్యకాంతానురాగలక్షణము!

కవిచంద్రులు జన్మభూమిని ధీరోదారు లగునందనులును, సుగుణసంపన్న లగుకన్నియలును, సంతోషస్వాంతు లగుసంసారులును, పెంపుగా నుండఁ గుతూహలు లగుచో సత్కళత్ర శీతకరచంద్రికల సాహిత్యనభోవీథిని విరివిగాఁ బ్రసరింపఁజేయవలయును.

## —♦ ప్రే మ ప్ర శం స ♦—

ప్రేమ వ్యోమమువలె ననంతము. ఆతపతాపముచే నలసియున్న జీవసముదాయమును మలయానిలసంచారము సంతసింపఁజేయునట్లు క్రోధానలకీలలచేఁ బరితపించుచున్న జనసముదాయమును ప్రేమరసప్రవాహములు తాపశాంతి నొనర్చి సంతసింపఁజేయును.

ప్రేమ లేనివిద్య యడవినిగాసిన వెన్నెలవంటిది. ప్రేమ రహిత మగుధనము తండులములు లేని తుషరాశివంటిది. ప్రేమదూర మగుసంఘము కలయికలేని యిసుకదిబ్బవంటిది. మానవత్వమునకు చిహ్నము ప్రేమయే.

శ్లో॥ ప్రే మైవ మానవో ధర్మో ద్వేషః పశుగుణో మతః
అతః సర్వేషు భూతేషు దయాం కుర్వీత మానవః॥

(సుధాకరుఁడు.)

అనఁగా సమస్తజీవరాశిపైని ప్రేమను ప్రకటించుటయే మానవధర్మము. ద్వేషమును జూపుట పశులక్షణము అని భావము. మఱియు,

శ్లో॥ యో దుఃఖితాని భూతాని దృష్ట్వా భవతి దుఃఖితః
సుఖితాని సుఖీచాపి సధర్మాత్మేతి కథ్యతే॥

(భారతము.)

అనఁగా నెవఁడు దుఃఖమగ్నములైయున్న జీవసమూహ ములఁ జూచి దుఃఖమును, సుఖసంపన్నములైయున్న ప్రాణిజా తముల నవలోకించి, ఆనందమును చెందునో వాఁడే ధర్మస్వ రూపుఁ డగు నరుఁ డని భావము కావునఁ గవులు సుఖసాధన మగుప్రేమగరిమను కావ్యములయందు విస్తరింపఁజేయవలయును.

## —♦ త్యా గ ప్ర శం స ♦—

ఇహమున శ్రేయమును, పరమున నిశ్శ్రేయసమును, సమ కూర్చునది త్యాగభాగ్య మొక్కటియే. త్యాగ మనఁ బరహిత

సంపాదనమునకై స్వార్థముల సంతోషపూర్వకముగా సమర్పించుట. మనపూర్వులు త్యాగమే జీవితమును కీర్తివంతముగాఁ జేయుసంపద యని వర్ణించియున్నారు ఈభావము భారతీయులకు వేదకాలమునుండియు అనాదిగా వచ్చుచున్నది కాని నూతనముగాఁ బయలనుండి గడింపఁబడినది కాదు. వేద మిట్లు తెల్పుచున్నది.



"నకర్మణా న ప్రజయా ధనేన త్యాగే నైకే అమృతత్వ మానశుః" అనఁగా కర్మాచరణముచేఁ గాని, సంతానప్రాప్తి వలనఁ గాని, ధనసంపత్తిమూలమునఁ గాని ముక్తి చేకూరనేరదు. అమృతత్వప్రాప్తికి త్యాగమొక్కటియే సాధనము- అని భావము.

ఈభావమునే పురాణములుకూడ ప్రకటించుచున్నవి.

శ్లో॥ ధనాని జీవితం చైవ పరార్థే ప్రాజ్ఞ ఉచ్ఛృజేత్
సన్నిమిత్తే వరం త్యాగః వినాశే నియతే సతి॥

అనఁగా ప్రాజ్ఞుఁడు నిజజీవితాదిసంపదలను పరసంతోషమునకై దత్తముచేయవలయును. జీవితాదులకు వినాశము తప్పనపుడు వ్యర్థముసేయుట పాడి గాదు- అని భావము.

కావునఁ గవిసోదరులు నిజకృతులయందుఁ ద్యాగసంపదను బెంపుగా వర్ణింపవలెను.

—♦ ఆత్మగౌరవప్రశంస ♦—

దేశమును కీర్తివంతముగాఁ జేయఁజాలునవి ఆత్మగౌరవాభిమానుల జీవితములే. ఆత్మాభిమానహీన మగుప్రజా

సమూహము హత ప్రాయము. అట్టిసంఘమునఁ బుట్టుటకంటె నరకమునఁ బడుట మేలు. "నిక్కమైన మంచినీల మొక్కటి చాలు, తళుకు బెళుకు రాలు తట్టెఁ డేల ?" అనునట్లు దేశమున మానఘనుఁ డొక్కఁ డున్నఁ జాలును. తేజోహీనులు వేల కొలంది యున్నను సంఘ మున్నతిని బడయనేర దని భావము.

తేజశ్శాలురజీవితము లతివిచిత్రములు. అగ్నికణము నిర్వాణము నపేక్షించును గాని తేజోహీనముగాఁ బడియుండఁ గోరదు. అటులనే యాత్మాభిమాని ప్రాణములనైనఁ గోల్పోవును గాని దైన్యముతో మనఁగోరఁడు. మన ప్రబంధములయందు ఆత్మగౌరవవిరాజితు లగుపురుషసింహులజీవితములు ఘనముగా వర్ణింపఁబడియున్నవి. ఆచరితములఁ జదువునప్పుడు మంచుగడ్డ కూడ అగ్నిగోళమును మించి యుండఁగోరును.

సూర్యోదయ మైనతోడనే చీఁకటి పీడిపోవునట్లు ఆత్మ గౌరవోదయ మైనవెంటనే దైన్యము సడలిపోవును. దాన మానవులు సానఁబెట్టఁబడిన రతనమువలెఁ గళాకాంతులతో విరాజిల్లుదురు.

"గ్రాసము లేక స్రుక్కిన జరాకృశ మైన విశీర్ణ మైన సా
యాసము నైన నష్టరుచి యైనను బ్రాణభయార్త మైన సం
త్రాసమదేభకుంభపిశితగ్రహలాలసశీలసాగ్రహా
గ్రేసరభాసమాన మగు కేసరి జీర్ణతృణంబు మేయునే ?"

(భర్తృహరిసుభాషితము.)

మానవుఁడు లభిలషించునది వీర్యవంత మగుజీవితము గాని దేవురింపుబ్రతుకు కాదు.

నిజజాతి దుర్భర మగుపరాభవమానముచేఁ బరితపించుచుండ ధైర్యముతో వారిఁ గాపాడఁ బరుగిడక, తనబ్రతుకును మాత్రము భద్రముగాఁ గాపాడుకొనఁగోరువాఁడు సంఘద్రోహి; లోకనింద్యుఁడు. కౌరవులు పన్నినపద్మవ్యూహమునఁ జిక్కుకొని, కొనయూపిరితో నున్న తనవారినిఁ గాపాడుటకై రణరంగమునకు లంఘించి, అరిచమూసముదాయములఁ జెండాడి, నిజప్రతాపతేజమును దిక్తటముల వ్యాపింపఁజేసి, ప్రాణములఁ బాసి, వీరస్వర్గమున కేగిన బాలవీరుఁ డగు అభిమన్యునిజీవితమునకును, దేవేంద్రుఁ డుగ్రుఁడై కులిశాయుధధారలచే నిజకులగిరిపక్షముల విదళించి, అన్యోగతిపాల్సేయుచుండ పిఱికిపందయై పరుగిడి, పయోనిధినీరమునఁ దూఱి, ప్రాణములఁ గాపాడికొనిన మైనాకునిమనుగడకును పోలిక గలదా?

కావునఁ గవిసోదరులు యువతీయువకులందును ఆత్మగౌరవసంపద యభివృద్ధ మగునట్టుల కథల చిత్రించుట ప్రశంసార్హము.

—♦ రసప్రశంస ♦—

సాగరమునకు నీరమే మూల మైనట్లు సాహిత్యమునకు రసమే స్వరూపము. రస మన మనోహరవస్తుసందర్శనశ్రవణ

ములచే హృదయమున జనించినయభిలాష చెక్కుచెదరక యొక్కరీతిగా నిలిచియుండునేని స్థాయి యని చెప్పఁబడును.

ఇద్దియే క్రమవికాసము నంది, ఆనందస్వరూపముగాఁ బరిణమించెనేని రస మనఁబడును.

సుమమున గంధమువలెఁ గావ్యమున రస ముండినఁగాని బుధాళికి ముదావహము గానేరదు. రసము నీరస మైనను, సంకర మైనను, సాహిత్యము సారవంతము కాదు.

ఇందుచేతనే రసాత్మక మగువాక్యమే కావ్య మని సాహిత్యదర్పణకారుఁడు లక్షణమును నిర్వచించియున్నాఁడు. సాహిత్యమునకు శోభను సమకూర్చురసములు తొమ్మిది.

"శృంగార హాస్య కరుణ వీర రౌద్ర భయానకాః
బీభ త్సాద్భుత శాంతాశ్చ"

అని ప్రధానరసములు తొమ్మిది తెలుపఁబడినవి.

ఈతొమ్మిదింటిలో శృంగార మన్నివిధముల నగ్రగణ్యమై తనరారుచున్నది. లోకసామాన్యమును శృంగారరసము రంజింపఁజేయునటుల ఇతరరసములు సంతసింపఁజేయఁజాలవు.

అప్పయదీక్షితులవారు ఉపమానాలంకార మొక్కటియే అలంకార మనియు, ఇతరాలంకారము లుపమానజనితము లనియుఁ, దెలిపినట్లు కొందఱు శృంగార మొక్కటే రస మనియు, తదితరములు శృంగారాంగము లనియు, నుడివి యున్నారు.

"ఏకో రసః కరుణ ఏవ" కరుణ మొక్కటియే రస మని భవభూతిమహాకవియుఁడు నుడివియున్నాఁడు. "అద్వైతానందలాభాయ శాంత ఏకః పరో రసః" బ్రహ్మానందప్రాపక మగుశాంత మొక్కటియే రస మని, అలంకారచంద్రికాకారుఁడు తెలిపియున్నాఁడు. "రసోవైసః" అను శ్రుతియందలి రసపదమునకు శాంతరస మనియే వీనిమతము. మఱికొందఱు అద్భుతరసమే సర్వరసాశ్రయ మన్నారు ఇటుల రసప్రాశస్త్యమునుగూర్చి మతభేదములు కలవు. ఏమయినను కావ్యమునకు రసము ముఖ్యము.

శృంగారముయొక్క యర్హతనుగూర్చి కొంచెము ముచ్చటింపఁదలంచితిని. సహృదయు లాదరముతో నాలింతురు గావుత. శృంగార మన వ్యస్తము లగు స్త్రీపుంవ్యక్తులఁ బ్రేమపాశముచే అవినాభావముగా సంఘటింపఁజేసి, అద్వితీయానందము నొసంగు నీశ్వరకళ.

నీరము సాగరరూపమునను, నదీరూపమునను ప్రవహించునటుల శృంగారము నాయకరూపమునను, నాయికారూపమునను ప్రసరించును. ఇతరరసము లిట్లు మిథునాశ్రయములు కావు.

నదులలో గంగాతరంగిణి పావనజీవనపూరితమై వెలయుచున్నది. పవనములలో మలయానిలము లలితమై యొప్పుచున్నది. లతలలో మాలతీవల్లి పరిమళకలితమై తనరారుచున్నది.

కాంతులలోఁ జంద్రిక చల్లనై వఱలుచున్నది. పైనఁ దెలుపఁ బడినపదార్థములు ప్రత్యేకగుణాశ్రయములై యొప్పుచున్నవి. రససార్వభౌమ మగుశృంగార మన్ననో? పావనమై, సుకుమారమై, ఆమోదభరితమై. చల్లనై, నాయికానాయకులు సంసారయాత్రను ఆనందముతో సాగించుకొనుటకు ననువగు మధురపాథేయమై ప్రకాశించుచున్నది.

అట్టి మృదుసుమసౌరభలలిత మగుశృంగారమును శుభసమయముల సంసారులు అత్తరువును వాడినట్లు కవిరసికులు దీనిని వినియోగింపవలయును గాని ముంతలతో వసంతము గుమ్మరించునట్లు ప్రయోగింపరాదు.

వైద్యులు శుద్ధిచేయని పచ్చిరసమును మందులోఁ జేర్చి, రోగుల కిచ్చినచో నోరు పట్టి కీళ్ల సడలఁగొట్టి, తుదకు రోగి నధోగతికిఁ దెచ్చునట్లు, ఔచిత్యశుద్ధిని గమనింపక శృంగార రసమును స్వేచ్ఛగా వాడినచో వెగటై పాఠకశీలములఁ జెడఁగొట్టి వారిచిత్తములఁ గళంకితములనుగాఁ జేయును.

శ్రీ ఇంద్రకంటి హనుమచ్ఛాస్త్రిగా రిట్లు తెలిపియున్నారు.

"శుద్ధిచేయని పాదరసం ఎలా కొంప తీస్తుందో, పరిపక్వంకాని శృంగారం అలా రోతపుట్టిస్తుంది" (ఉదయిని.)

కావున శృంగార మను పేరుతో సంఘవినాశహేతువగు నవినీతిని కవులు వర్ణింపరాదు.

## —♦ సం స్కృ త ప్ర శం స ♦—

భూవలయమునఁ గలభాషలలో సంస్కృతభాష సర్వ విధముల ఘనమై తనరారుచున్నయది. మఱియు భారతదేశమున నాగరకులవాడుకలో నున్న దేశభాషలకుఁ బదలాలిత్యమును, భావసౌభాగ్యమును సమకూర్చునది సంస్కృతపదసాంగత్యమే. "దేశభాషలందుఁ దెలుఁగు లెస్స" అను నుడికారపుసొంపునకుఁ గారణము తత్సమపదసాహచర్యమే.

కేవలములగు తెలుఁగునాఁటిమాటలకూడికచేఁ దెనుంగు నకు పైనఁదెలుపఁబడిన మనోహరత రాలేదు. పక్షపాతము వీడి, పరికించినచో వట్టియచ్చతెలుఁగుపలుకులు గల తెలుఁగు కైత మొఱకుగా నుండుటయు, తత్సమపదసంపద గల ఆంధ్ర కవిత లలితముగా నుండుటయుఁ దెలియనగును.

ఇంత యేల? "దేశభాషలందుఁ దెలుఁగు లెస్స" అను సామెత శ్రుతి కింపుగా నుండుటకుఁ గారణము, "దేశభాష లందు" అను తత్సమపదానుసారియై "తెలుఁగు లెస్స" అను తెలుఁగుపలుకు లుండుటయే. ఇటులనే యాంధ్రసాహిత్యము నందలి గద్యపద్యాత్మక మగుకవిత్వము నాదపదార్థభావ ములచే నానందమును సమకూర్చుటకు హేతువు- దానియందు మనోహరము లగు తత్సమపదములు అలరారుచుండుటయే; అని తెలియనగును.

ఈసందర్భములో శ్రీ భోగరాజు నారాయణమూర్తిగారి భావమును కనుఁడు: "బాలరసాలపల్లవఖాదనము చేతనే కోకిలము కలకంఠ మగుచున్నది మృదుమధురసంస్కృతపదసాలభ్యసంకలిత మగుటచేతనే దేశభాషలందుఁ దెలుఁగు తెన్నయగుచున్నది" (ఆంధ్రకవిత్వచరిత్రము.)

సత్య మిట్లు ప్రత్యక్ష మగుచుండ నేఁటి నవ్యసాహిత్యప్రియులు కొందఱు సంస్కృతశబ్దకర్దమము తేటతెనుంగునీటిపైఁబడి దానిసొంపును మాపుసేయుచున్న దనియుఁ, గావున సంస్కృతమును తెనుంగుకైతదరికిఁ జేరకుండఁ దఱిమివేయవలయు ననియు, అట్లుచేయనినాఁడు తెలుఁగుబాసలో ముచ్చటగాఁ గబ్బముల వ్రాయుట కనువు కా దనియు, సంస్కృతము నంటిపెట్టుకొని తిరుగునంతవఱకుఁ దెనుంగుపలుకులపోలఁతి తన సొంపును పెంపుఁజేసికొనఁజాల దనియు, హృదయావేదనముల వెలిపుచ్చుచున్నారు.

"సంస్కృతముయొక్క దాస్యమునుండి విముక్తి నొందుచున్నామని మానమ్మకం" అని శ్రీ కట్టమంచి రామలింగారెడ్డిగారు తొలకరిపీఠికలో పలికియున్నారు. సంస్కృతదాస్యమునుండి విముక్తులైన మననవ్యకవితాధూర్వహులు కొందఱు నిజజననిఁ బరిత్యజించి సవతితల్లికడఁ జేరు తనయులట్లు పావనములగు గీర్వాణవాణీపదములఁ బరిత్యజించి నవీనయావనీపదముల నాశ్రయించుచున్నారు.

"లేతవిడాకు" అనుకథలో శ్రీ విశ్వనాథకవిరాజుగారు చిత్రించిన మంజులాంధ్రవాక్యరత్నములఁ బరికింపుఁడు. క్రిందిది శృంగారం, బంగారయ్య అను నాయికానాయకుల ప్రసంగశైలి.

"బంగారం:—షప్ నోరు మూయ్. శృంగారం:—నేను మూయను. ఒకరినో రెందుకు మూయాలి? బం—నీనోరు. శృం:—నో మోర్. బం:—ఉే కేర్. శృం:—వై సార్. బం:—ఖపడ్దార్. శృం:—బలాదూర్. బం:—స్టాప్. శృం:—పటప్. బం:—వై ప్యారీ! శృం:—నో సారీ."

కటకటా! నిజమాతప్రేమతో నొసంగు మధురపాయసమును రోసి, పరుల యాచించి, కారాసారాయిని బీలుచునట్లు నవ్యకావ్యరసపిపాసువులు హూణవాణిని సేవించుచున్నారు. ఇట్టి యవనీకరించిన తెనుంగురచనలు అమితముగాఁ గలవు. తెలుఁగుమాటకు ఇంగ్లీషుప్రత్యయము, ఇంగ్లీషుపదమునకు తెలుఁగుప్రత్యయము, ఆచ్ఛికపదమునకు సంస్కృతప్రత్యయము చేర్చి, భాషను సంకరము చేయుచున్నారు.

ఈపైని జూపిన పదశైలియా శిష్టవ్యవహారసుందర మగు వ్యావహారికాంధ్రభాష? దీనిలావణ్యమును చూచియా, సంస్కృతభాషను దరికి రాకుండఁ జేయఁజూచుట?

పరిశీలింప సంస్కృతమును విసర్జింపఁజూచుట సంకుచితభావము గాని ఉదారాశయము కాదు. ఏల యందురా? నీరాధారము లేకున్న చెట్టుపైరు నీరసించి, తెల్లఁబాఱునట్లు,

సంస్కృతపదసాహచర్యము లేకున్న త్రిలింగకవిత రసవిరహితమై, వెల్లఁబోవును. ఎవ్వఁడేని కవివరుఁడు పట్టుదలతోఁ గష్టపడి యేకొలఁదిపద్యములనో దేశ్యకవితలో రమ్యముగాఁ జిత్రింప నేర్చినను, ఆరీతిగాఁ గావ్యమును తుదివఱకు సాగింపఁ జాలఁడు.

"అచ్చతెలుఁగునందు గ్రంథము రచించుట మిక్కిలి కష్టము" అని శతాధిక గ్రంథకర్త లగు వీరేశలింగముపంతులవారు తెలిపియున్నారు. తుదివఱకు నచ్చతెలుఁగుకవితను సాగించినకవు లుండ నీ వేల యిటు లనుచుంటి వందురా? కలరు కొలఁదిగా; సందేహము లేదు. వారికావ్యముల ప్రక్కనే సంస్కృతపదకలితము లగుకృతులఁ జేర్చి పరికించునపుడు కవితామనోహరత దేనియందు తరంగిత మగుచుండునో విదిత మగును.

ఇట్లు వ్రాయుటచేఁ గేవ లాచ్ఛికభాష కవిత కక్కఱకు రాదని నాభావము కాదు. మఱేమన, సంస్కృతపదయుత మగు నాంధ్రకవితకును, ఆచ్ఛికపదమయ మగు తెనుంగుకవిత్వమునకును, వన్నెకట్టవలసివచ్చిననాఁడు మొదటిదానికి రెండవది తీసికట్టగును కాని సరియగు గీటునకు రాఁజాల దని నాయూహ.

ఇఁక నొకముచ్చట. అచ్చతెలుఁగుకబ్బములు తత్సమపదకావ్యములవలె అనాయాసముగా నర్థముచేసికొన సాధ్యములును గావు. కావుననే, "ఆంధ్రభాషామయం కావ్య మయోమయవిభూషణం" అన్న పరిహాసోక్తిలోని ఆంధ్రభాషాపదమున

కర్థము అచ్చతెలుంగుపలు కనియే. ఈ అచ్చతెలుఁగుకైతలు తత్సములకును, తద్భవులకునుగూడ దురవగాహములే.

నన్నయభట్టారకాది ప్రాచీనపండితకవివరు లెల్లరు ఆంధ్ర కవిత్వమునందు ఆచంద్రార్కయశస్సాంద్రులై వినుతి కెక్కుటకుఁ గారణము వారు సంస్కృతపదసాహచర్యముతోఁ దెనుంగుకవితను బూరించుటయే. కనుఁ డీక్రిందిపద్యరాజమును,

ఉ. సారమతిం గవీంద్రులు ప్రసన్నకథాకవితార్థయుక్తితో
నారసి మేలునా నితరు లక్షరరమ్యత నాదరింప నా
నారుచిరార్థసూక్తినిధి నన్నయభట్టు దెనుంగున న్మహా
భారతసంహితారచనబంధురుఁ డయ్యె జగద్ధితంబుగన్.

(నన్నయ.)

పాఠకులపరిశీలనమునకై అచ్ఛికపదయుత మగుపద్యమును, తత్సమపదకలిత మగుపద్యమును ఉదహరింతును వీని యందలి మార్దవమును పాఠకులే నిర్ణయింతురుగాక.

"క. ఉక్కిడి నేలతేఁడుల
డక్కనఁ గనుబ్రామి నన్నిటకుఁ దెచ్చిన బ
లైక్కలి కాఁడవు నీ కీ
చిక్కనమగతనము దెల్ప సిబ్బితి గాదే."

(కూచిమంచి తిమ్మనార్యుఁడు.)

తే. దానవాధమ యలజనస్థానవాసు
లైనరాక్షసు లంద ఱొక్లాజి మడిసి

శక్తి చాలక నీ విల్లు చౌర్యవృత్తిఁ
బట్టి నన్ దెచ్చి తిది నీకు బంటుతనమె

(గోపీనాథకవి.)

నిజ మారయ అనార్యదేశములు ఆర్యపదవిన్యాసముల చేతనే వన్నె కెక్కినమాట చరిత్రప్రసిద్ధము. దీనిని గాదన సాధ్యము గాదు. నేటియాంధ్రులభాష కోదులు లోనగు కొండ వారిమాటలవలెఁ బరుష మోటుగా నుండక, మృదువై, మాధ్వీకాతిమధురమై, వెలయుటకుఁ గారణము సంస్కృతభారతీపద లాలిత్యసాంగత్యమే యనుట అతిశయోక్తి కాదు.

బహుకావ్యనిర్మాణచతురులై, ఆంధ్రభాషాసేవకై తమ జీవితమును ధారవోయుచున్న శ్రీ జయంతి రామయ్యపంతులుగారేమి వ్రాసిరో కనుఁడు: "ఏయేదేశములందు సంస్కృత భాష వ్యాపించెనో యాయాదేశభాషల కదివఱకు లేని శబ్దార్థ సంపదఁ గలిగించి, తనకుఁ బుత్రిక లనఁదగు గౌరవమును గల్పించెను. మొత్త మీదేశములో సంస్కృతభాషాసంపర్కముచే బాగుపడనిభాష యొక్కటియును లేదనియే చెప్ప వచ్చును" (ఆంధ్రభాషాసేవ- రజతోత్సవసంపుటము.)

మఱియు, ఆంధ్ర మన తత్సమపదసమ్మిళిత మగుభాషయే కాని తత్సమపదవిరహిత మగు కేవలతెనుఁగుబాస కాదు.

సమశీతోష్ణసుందర మగు మలయమారుతమట్లు ఉభయ భాషాత్మకములై మృదుమధురముగా నుండుకావ్యములు లోక

మున కింపు గొలుపును. కావునఁ గేవలాచ్ఛికపదకఠినములును, ప్రత్యేకగీర్వాణశబ్దజటిలములును కాఁగూడదు.

ఈసందర్భముననే శ్రీమాన్ ప్రతివాదిభయంకర పార్థసారధి, బి. యే; బి. కామ్. గారు ఏమి వ్రాసిరో కనుఁడు. "అతి కర్కశము లౌ గులకరాళ్లవంటి ప్రాచీననారికేళభాషయుఁ బ్రయోగార్హము కాదు. అంతకంటె హేయము, ప్రాంతీయము, పేలవము నౌ కొందఱియాధునికుల పలాండుపాకభాషయుఁ దగినది కాదు. శబ్దసౌభాగ్యముతోఁ బాటు భావస్నిగ్ధత మేళవించిననే రసమయ మగును." (పద్మనాయకపత్రిక.)

కావున సరసకవితాభిమానులు సంస్కృతభాషతో నసహాయోద్యమము సాగింపరాదు. విమర్శకాగ్రేసరాదిబిరుదాంకితు లైన మానున్నగారు శ్రీ బ్రహ్మయ్యశాస్త్రిగారు ఆంధ్రభాషనుగూర్చి యిట్లు ముచ్చటించియున్నారు.

"మఱియు నాలోచించిచూడఁగా మనభాష పలుభాషలవికార మైనట్లుగా నాకుఁ దోఁచుటచే నే నావిషయము నే యిందు వ్రాసియుంటిని...... ఇతరభాషలవలన మనభాష పుట్టిన దనిన మనభాష కింతయు నగౌరవము లేదు"

గీ. జన్మ మెందైన నేమి తా సద్గుణంబు
గలిగి వర్తించెనేని జగమ్ము మెచ్చుఁ
దమ్మి బురదలోఁ బుట్టియుఁ దగుగుణముల
సరసులందు ఘనతతో మెలంగుఁ గాదె

(నన్నయభట్టారకచరిత్రము.)

దీనింబట్టిచూడఁ దెలుఁగునకు సొంపుసమకూరుటకుఁ గారణ మితర భాషాసాంగత్యమే యని విదిత మగుచున్నది. పరిశీలింపఁ దెలుఁగునకు నెక్కుడుశరమ్యతను సమకూర్చినది సంస్కృత వాణియే యని రూఢి యగును. వినుఁడు: శ్రీ కోరాడ రామ కృష్ణయ్య ఎం. ఏ. గారివచనముల—"గీర్వాణసారస్వతమహావృక్షశాఖకిఁ గట్టిన యంటుగా బయలుదేఱి, విజృంభించిన యాంధ్రసారస్వతమునందు" (ఆంధ్రభారతవిమర్శనము.)

కావునఁ దెలుఁగుకవిసోదరులు తమ్కైతలకు సంస్కృతమును సహాయముగాఁ జేకొనవలయును గాని, నిరాకరింపరాదు.

సంస్కృతప్రాశస్త్యమునుగూర్చి శ్రీ జొన్నలగడ్డ సత్యనారాయణమూర్తి యం. యే., బి. యల్., గా రేమివ్రాసిరో కనుఁడు:

"సంస్కృతమున కెన యైనభాష పృథ్వియందు లేదు. దీనియందలి ప్రత్యక్షరము...... భావబంధుర మైనది" (సాహిత్యతత్త్వవిమర్శనము.)

చెన్నరాజధానీప్రధానామాత్యు లగు శ్రీమాన్ రాజగోపాలాచార్యులవారి బోధలఁ గనుఁడు: "భారతీయుల నాగరకతయును, సంస్కృతభాషయును, ఒకదానికొకటి పెనవైచుకొని యున్న వనుటలో సందేహము లేదు...... సంస్కృతము చదువుటకు చాల రమ్య మైనభాష. (ఆంధ్రపత్రిక.)

శ్రీ ఆచార్యులవారు తెలిపినటుల తెలుఁగునకు చదువ నింపును సమకూర్చునది సంస్కృతమే. కావునఁ దెనుంగులు

సంస్కృతమును తప్పక ఆరాధింపవలయును "యుక్తియుక్తం వచో గ్రాహ్యం బాలాదపి సుభాషితం" అను ఆర్యోక్తినిబట్టి బాలురనుండికూడ సుభాషితములఁ జేకొనవలయు నని విదిత మగుచుండ విబుధవాణినుండి సుపదముల సమకూర్చుకొనుట ప్రాజ్ఞతాలక్షణము కాదా ?

## —♦ ఆంధ్రభాషాప్రశంస ♦—

సాహిత్యమున వాడఁదగుభాష యెట్టిదిగా నుండవలయు ననువిషయమున రెండుపక్షము లేర్పడి యున్నవి. ఇందు మొదటితరగతివారు గ్రాంథికాంధ్రాభిమానులు రెండవతెగ వారు వ్యావహారికాంధ్రాభిరతులు. మొదటివారివాదము కవిత కుచిత మగుభాష సనాతనలక్షణలక్షిత మైనదే యని. రెండవ వారి వాదము ఈనాఁటి శిష్టులవ్యవహారములో నున్న వాడుక భాషయే కాని సలక్షణభాష కా దని.

మొదటివారిపక్షమున ఛందోవ్యాకరణాదిశాస్త్రగ్రంథ ములు ఆధారములుగా నుండుటచే వారిభాషయొక్కస్వరూప మెట్టిదో సువిదిత మగుచున్నది. రెండవవారిపక్షమున విధినియ ములఁ దెల్పుగ్రంథములు లేకుండుటచే వారిభాషాస్వరూపము సుబోధము కాకున్నది. తెలియుటేసు ? "వ్యావహారికభాష అంటే యిప్పుడు శిష్టులవ్యవహారంలో ఉన్నభాష. అదే దేశి, జాను తెనుఁగు" అని రావుసాహెబు శ్రీ గిడుగు రామమూర్తి పంతులుగారు ప్రతిభలో నిర్వచించియున్నారే! అందురా ?

వారిచ్చినలక్షణమునుబట్టియే వ్యావహారికభాషాస్వరూపము తెలియరాకుండుట.

కారణ మే మందురా? ఈనవ్యనిర్వచనమునఁ జేర్కొనఁబడిన శిష్టు లెవ్వరు? అను పూర్వపక్షము వచ్చుచున్నది. శ్రీ పంతులవారు వ్యావహారికభాషాస్వరూపమును సూత్రించిరి కాని, శిష్టలక్షణమును బోధింపరైరి. అందుచే ముందు శిష్టులు నిర్దుష్టు లైనఁగాని, వ్యావహారికభాషాస్వరూపము సందృష్టము కానేరదు. శ్రీ పంతులువారు నిర్వచించినసూత్రమునకు "ఎవ్వరియుచ్చారణ పిన్నవా రనుకరింపన్ జూతు రాపెద్ద వారరయన్ శిష్టులు" అని శ్రీ గిడుగు వేంకటసీతాపతిరావుగారు వివరణమును వ్రాసియున్నారే? దీనిచే శిష్టపదార్థము విదితము కాలేదా? అందురా!

కాలేదు. సరియేకదా! ఈవివరణము మఱింత క్లిష్టతను దెచ్చిపెట్టినది. ఎందుచే ననఁ, బాపనపిన్నలు వారిపెద్దలయు, రాకొమరులు వారిపెద్దలయు, కోమటికొడుకులు వారిపెద్దలయు, కాపుబిడుతలు వారిపెద్దలయు ఉచ్చారణముల ననుకరింతురు. ఈరీతినే ఆయాక్రిందికులములలోని కుఱ్ఱలును వారిపెద్దల యుచ్చారణముల ననుకరింతురు.

అందుచే నేయుచ్చారణమున కాయుచ్చారణమే కాని యేకత్వము కానరాదు. శ్రోత్రియగృహముల ఇష్టా రా అనియు, అమాత్యమందిరముల ఇట్రా అనియు, క్షత్రియభవనముల

ఇటు రా అనియు, వైశ్యనివాసముల ఇలా రా అనియు. కాపుల యిరవుల విలా రా అనియు వ్యావహారికపదభేదములు విన నగును. ఇం దేది ప్రయోగార్హమో తెలియు టెట్లు ?

మఱియు శ్రీ రామమూర్తిపంతులుగారు ఆంధ్రులు రెండుకోట్లున్నారని తెలిపియున్నారు వీరిలో శిష్టులును, వారి శిష్యులును, ఏకొలందిమందియో యుందురు. ఇంక మిగిలినవారి మాట ఏమి ? వారికి నవ్యసాహిత్యరసపిపాస యుండదా ? పోనీ ! వారివ్యవహారములో నున్న గ్రామ్యభాషలో గ్రంథములు వ్రాయుదమన్న శిష్టవ్యవహారసిద్ధ మగుభాష కాకుండుటచే నవ్యసాహిత్యము వా రంగీకరింపరు కదా !

ఇంక నతిపామరజనవ్యవహారములో నున్న నింద్యగ్రామ్యములోఁ గవితల నల్లుట యన బూతు లాడుటయే యగును కాదా ? అందుచే మాలమాదిగ తెగలగతి యే మగును? వీరికిని నవ్యసాహిత్యరసాస్వాదనాసక్తి యుండునే ? పోనీ, వీరిబాసలో నున్నబూతుల నోదిగించి, కావ్యముల వ్రాసిన వారికి రుచింపవే ! స్త్రీపురుషాదిపామరజను లెల్లరు మాటలాడునపుడు ప్రాయికముగా గుహ్యావయవవాచకములను, వానివ్యాపారములను, ప్రసక్త మగుచుండుట మనము వినుచునేయున్నాము. వారి కాజాతిపదములు శ్రుతిసుఖదము లగు జాను తెలుఁగు పలుకులగును కాని శ్రవణపుటకటువు లగు మోటుమాటలుగాఁ దోఁపవే !

కీర్తనమున ననుపల్లవివలెఁ బ్రతివాక్యమునకును బూతు పలు కూఁతగా నుండును. తల్లితోఁ దనయుఁడును, అక్కతోఁ దమ్ముఁడును మాటలాడునపుడుకూడ బూతురతనముల రవళింపఁ జేయుచుందురు. ఈపామరభాషను కావ్యభాషగాఁ బరిగణింపవలదా? ఇంతకంటె సోదరద్రోహము కలదా? హరిజనోద్ధరణమే లోకతారకమను ప్రేమనాదము దిక్తటముల మాఱు మ్రోఁగుచున్న యీసమయాన హరిజనులవిజ్ఞానాభివృద్ధికై నవ్యసాహిత్యరచనలు వెల్లువిరియవలదా?

ఈక్రొందెలుంగున కొకదారియు, తెన్నును కానరాదు "ఎవరికివారే యమునాతీరే" అనునట్లు ఎవరికితోఁచినట్లు వారు కవితల నల్లుచున్నారు. ఈనవ్యకావ్యములయందలి భావము సామాన్యజనులకు నందుబాటులో నుండక ఆకాశపథమున కేగుచున్నది. ఎవ్వఁడో యణిమాదిసిద్ధులు గల యోగిపుంగవునకు దానిసొబగు కొలఁదిగా గోచరమగును. ఈయవి యనుభవవేత్తలమాటలు కాని సామాన్యజనోక్తులు కావు.

"ప్రస్తుతము నవ్యసాహిత్యనిర్మాతలలో ఏకత లేదు. వారిభాషలో ఏకత లేదు. వారికవిత్వములో ఏకత లేదు. రచనలు, భాష, భావము, వ్యక్తిగతముగానే యున్నవి."

(శ్రీ మండపాక పార్వతీశ్వరశాస్త్రిగారు—ప్రతిభ.)

మఱియు నీనవ్యసాహిత్యభాష ఎందుకును కొఱగానిదని, ప్రాజ్ఞులు తెలుపుచున్నారు. "మన పురాతనపేరుప్రతిష్ఠ

లకుఁ గాని, భావికాలములో దేశములో మనము సంకల్పిం చుకోవలసిన పరిస్థితులకుఁ గాని యిప్పటివాఙ్మయము సరి పడదు." (ఇప్పటివాఙ్మయము — ప్రతిభ.)

నవ్యసాహిత్యకవితకుఁ గీర్తి రేకెత్తవలయు నన్న అందలి భావములు పండితుఁడుమొదలు పామరునివఱకును గల జన సమూహామునకు ఆనందమును గలిగించు నందుబాటులో నుండ వలయును- అని విద్వాంసులు బోధించియున్నారు.

"అనాగరకులుగా వుండేవారి దగ్గరనుండీ నాగరకశిరో మణులుగా ఉండే సమస్తప్రజలకూ, వారి వారి యోగ్యతలకూ, అనుభవాలకూ తగిన వాఙ్మయాన్ని నిర్మించి, యీ నవ్యసాహి త్యములో చేర్చవలెను. అట్లు అయితేనే యిది నవ్యసాహిత్యపరి షత్తు అగును" ఈపలుకులు నవ్యసాహిత్యముయొక్క నాల్గవ సమావేశమునకు అధ్యక్షసింహాసనము నలంకరించిన పంచా గ్నులవారివి.

ఈనవ్యవ్యాకరణతీర్థులవారి యీప్రబోధసారము నా స్వాదించువారికి కవులు దర్భపవిత్రపాణులైన శిష్టసాంప్రదా యమువారు గ్రాంథికాంధ్రములోఁ గావ్యములు లిఖించునట్లు కవితల సృష్టింపక, హాలీసిగరెట్టుహోండులవలె పండితపామర సుబోధముగా నుండునట్లు నవ్యసాహిత్యకృతుల విరచింప వలయు నని తెలియరాకుండునా? కావునఁ బండితభాషయో, గ్రామీణవాణియో కావ్యముల వాడవలయును గాని, మధ్య నీత్రిశంకుజాను తెనుం గెందులకు?

ఈ క్రిందివాక్యరత్నముల నవలోకింప నవ్యసాహిత్య ప్రియుఁడు శిష్టవ్యవహారసమ్మత మగుభాషనే యుపయోగింపఁడనియు, ఆతని కింపు గలిగించుపదముల గ్రామ్యగ్రాంథికవ్యావహారికవైదేశికభాషలనుండి తెచ్చికొని, స్వేచ్ఛగా వాడుకొనుననియు విదిత మగును "ఒక్కొక్కపుడు రసస్ఫూర్తికోసము ప్రాచీనప్రయోగాలు ఎంచుకొంటాడు. మాండలికపదములూ, మారుమూలమాటలూ, గ్రామ్యములూ, వుపయోగించడానికి వెనుకతీయఁడు"

(శ్రీ తెలికిచర్ల వెంకటరత్నం ఎం. ఏ; గారు—ప్రతిభ.)

మఱియు నవ్యసాహిత్యనిర్మాతల స్వభావ మిట్లు తెలుపఁబడినది.

"నవ్యసాహిత్యనిర్మాతల కట్లు కాదు వారు అభ్యసించినవీ అనుభవంలోకి తెచ్చుకోడానికి ప్రయత్నించేవీ వైదేశికపు భాషలూ భావాలున్నూ. వాటిని ముందు మాతృభాషాభ్యస్తములయిన తమ మనస్సులోనికి ఎక్కించుకోవాలె. ఆపిదప ఆభావాలను తాను భావనాపథంలో భావించిన రూపానికి తగినట్టు ఆవిష్కృతితో వెల్లడింపబూనుకొనవలెను"

(పంచాగ్నులవారు—ప్రతిభ.)

కంటిరా ? ఎంతవివరముగా నెంతమంజులముగా జాను తెనుంగులోనిజభావగాంభీర్యమును ప్రస్తరీకరించిరో !

ఈసుబోధమువలనఁ దేలిన నిగ్గేమి ? గ్రాంథికవాదుల మాటలనుగాని, శ్రీ గిడుగువారి నుడులనుగాని, ఆధారముగాఁ

జేకొనక, తమ కిచ్చవచ్చినపదముల విచ్చలవిడిగాఁ గైతలలో వెదజల్లవచ్చు ననుభావమే

ఈపైని వివరింపఁబడిన యుభయభాషాకోవిదుల ప్రబోధమువలనఁ దేలినసిద్ధాంత మేది యన, కవులు నియమశోభిత మగుగ్రాంథికభాషను గావ్యములం దుపయోగించి, ప్రాజ్ఞుల కానందమును గలిగింపవలయును. లేదా? నియమవిరహిత మగుగ్రామ్యభాషను గృతులలో వాడి, పామరసోదరుల రంజింపఁజేయవలయును. అంతియేకాని యీరెంటికిని చేరని మురారిభాషను వాడి, నిరుపయోగముగాఁ గావ్యముల వ్రాయఁ జనదు - అనువిషయమే.

పరిశీలించిచూచిన భాష నిర్దుష్ట మగుసరణిని నిర్దిష్టమైననాఁడే అందు వ్రాయఁబడినగ్రంథము స్థిరస్థాయియై, జన సంతతికి శాశ్వతానందవిజ్ఞానముల సమకూర్పఁగలదు గాని కట్టుబాటులు లేనిబాస నిలుకడ లేని దగుటచే దానియందు వ్రాయఁబడిన కబ్బములు స్థిరతరానందమును సంఘటింపఁజేయఁ జాలవు. అని బోధపడును. "భాష ఎంతమంచిదైతే దానివల్ల నెరవేరేకార్యము అంతచక్కఁగా కొనసాగుతుంది" అని శ్రీ వెంకటరత్నంగారు ప్రతిభలో సెలవిచ్చియున్నారు.

కావునఁ గాఁగి చల్లారినపాలవలె, చల్లనై, తియ్యనై యున్న తేటతెనుంగుగ్రాంథికభాషలో నీటుగాఁ గావ్యముల విరచింపవలయును గాని, ఎట్టిమెఱుఁగుఁబోదుగు లేక, తప్పటడు

గులు వేయుచు ప్రతిపదమునను వినిపాతములపా లగుచున్న లేబాసలో కాదు. ఇ దేమివింత ! ఇరువదియైదేండ్లయీడు గల నవ్యభాషను తప్పటడుగులభాష యనుచుంటివి అందురా? ఇవి నామాటలు కావు ఆధునికవిద్వాంసుల ప్రౌఢోక్తులు.

"నవ్యసాహిత్యరచన ఆరంభమై పూర్తిగా పాతికఏండ్లయినా దాఁటనిస్థితిలో ఈ కత్తులదూయడం......యీవర్తనాన్ని ఆలోచిస్తే యెట్లావున్నదంటే ఏడాదిపసిబాలురను బలాత్కారంగా అడుగులుపెట్టడానికి ప్రోత్సహించి, తప్పటడుగులు పెడతారా ? అని ముడుకులు విరగకొట్టడానికి సిద్ధపడడంలాగ వున్నది. ఇంతవరకు యీసాహిత్యము జనసామాన్యంలోకి వ్యాపింపలేదు. మొన్న మొన్నదాకా మడికట్టుకొన్న బిల్వేశ్వరీయవాఙ్మయమే ప్రచారంలో వుండెను."

(పంచాగ్నులవారు—ప్రతిభ.)

పాక్షికదృక్కులదూరముచేసి, ధర్మదృష్టిని జేరఁదీసి, పలుకవలసిననాఁడు ప్రౌఢభాష కుంటు తీఱుతీర్పులు పిల్లబాస కుండఁబోవు. కాలము గడచినఁగాని భాషకు నిర్మలతయు, మంజులతయు సమకూరనేరవు. కనుఁ డీక్రింది వాఙ్మహారీతులు.

"భాషాస్రవంతి ఆత్మపోషణార్థము వుపనదులనుండి నీరు రాబట్టుకుంటుందని, తన కనుకూలమైనరీతిని ఎప్పటిపరిస్థితుల ననుసరించి అప్పుడు కొంతవరకు మార్గము మార్చుకుంటూవుంటుందనీ, వరదలసమయములో గట్ల నతిక్రమించి

పొరలి పోతుందనీ, కొన్నాళ్లకు తనంతటతానే తిరిగి స్థిమితపడి తేటతేటి వుంటుందనీ వా రెరుగరుకాబోలు"

(శ్రీ తెలికిచర్ల వెంకటరత్నంగారు—ప్రతిభ.)

వీరి యీప్రసంగమున నొకవింత చూపట్టుచున్నది. వీరు తెలిపిన యీనవ్యభాషాస్రవంతీసాదృశ్యము గ్రాంథికాంధ్రము నకుఁగూడ అన్వయింపవచ్చును కదా? అట్లయిన వీరు నిరూపించునట్లే గ్రాంథికభాష పైయవస్థల నన్నిటిని దాఁటి కొంత కాలమునకు (అనఁగా నేఁటికి) తేటతేటి జానుతెనుఁగై, తేనెవలె మధురమై "దేశభాషలందుఁ దెలుఁగు లెస్స" అను ననుపమానకీర్తి నందియున్న దనుసంగతిని వీ రెఱుంగకుంటయే.

మఱియు వీరు ఆప్రతిభావ్యాసరాజములోనే "గ్రాంథిక భాష పురాతనవస్తుప్రదర్శనశాలలో వుంచుకొని వేడుకకోసము చూచి ఆనందించుకొనే వస్తువులకు తుల్యముగా అయిపోతున్నది. కాలము ముల్లిన పండితకవులయిళ్లలో అది కుంటినడకలతో అక్కడక్కడ కనబడుతూ ఉండే అవస్థకు వచ్చినది" అని తమవివేక ముప్పొంగునట్లు సెలవిచ్చియున్నారు.

దీనింబట్టిచూడ గ్రాంథికభాష ప్రాఁతబండములఁ జూపుటకు వేయఁబడిన పాకలలో మూలఁ బడియుండఁదగిన దనియు, వీరి క్రొందెలుంగుబాస వీథియంగడులలోని చాఁపలపైఁ బఱుపఁబడి, అందఱి కందుబాటులో నిలిచి, కుంటినడకలు లేక, తాళానుకూలము లగునడుగుల వేయుచున్న దనియు విదితమగుచున్నది కదా?

ఆహా! ఈనవ్యసాహితీప్రియు లెట్టివిచిత్రరచనలకుఁ బాల్పడుచున్నారు. ఒకమూల భాస ప్రాఁతగిలినఁగాని తేట తేటనేటి దని నిరూపించుచు గ్రాంథికాంధ్రము ప్రాఁత దగుటచేఁ గుంటినడకలపాలై మూలఁ బడిన దనియు, చిఱుదెలుంగు పిన్న దగుటచేఁ దప్పటడుగులు వేయుచున్న దనియు, భావములఁ దెలిపియున్నారు. కావున ఈరెండుబాసలును పడుచువారివలె నొయారపునడకలతోఁ గావ్యోద్యానవీథుల సంచరింపఁజాల వని తేల్చిరే? ఇఁక వీరు తమనవ్యసాహిత్యమునకుఁ గొని వచ్చిన గొప్ప యేమి?

నవ్యసాహిత్యపండితులు ఎన్నఁడును కని విని యెఱుఁ గని యపరూపశబ్దముల గ్రంథములలో వాడుచున్నారు.

"పొగరుబోతుత్వం" అని యొక నవ్యపండితాఖండ లుండు ప్రయోగించి యున్నాఁడు. ఇందు "పొగరుబోతు" తెలుఁగునుడువు. "త్వం" సంస్కృతప్రత్యయము. పండితులవా రీరెంటిని నంటఁగట్టి, 'పొగరుబోతుత్వం' అను జానుతెనుంగు నుడికారపుసొంపును గొనివచ్చిరి.

ఈ సొం పెట్లున్న దన, సునీతివటువునకు జన్నిదము తగిలించినట్లున్నది. పూర్వ మపూర్వవర్ణనములచేఁ గాళిదాసు నకు దీపశిఖాకాళిదా సనియు, భారవికి ఛత్రభారవి యనియు, మాఘునకు ఘంటామాఘుఁ డనియుఁ బ్రసిద్ధివచ్చినట్లు- ఈ యపూర్వపదప్రయోక్తకుఁ, గూడ ప్రసిద్ధి రావచ్చును.

## —♦ అనుకరణ ప్రశంస ♦—

ఆంధ్రకవిసోదరులు అన్యభాషాకావ్యాలంకృతము లై యున్న మనోహరము లగు కథాసంవిధానములను, ఘనము లగు భావావిష్కరణములను, గంభీరము లగు వక్తృవైభవము లును, అమృతతుల్యము లగు నీతిమర్యాదలను, తెలుఁగుకైత లోనికిఁ గొనివచ్చుట యెంతయుసమంజసము.

కాని పరానుకరణము స్వీయజాతీయతారూపమును మాపునదిగను, నిజభాషాసౌభాగ్యమును భంగముసేయునది గను ఉండరాదు.

వినుఁడు ఇంద్రగంటివారి బోధ —

"కాని అతుకోఁని పాశ్చాత్యముద్రలు వేసుకొని ఆర్య సాహిత్యములను వికృతపరచి అవకరపురచనల చేయుడం ఆత్మ వినాశమూ, అపహాస్యభాజనమూ మాత్రమే. (ఉదయిని.)

షేక్స్పియర్ లోనగు యవనకవులు విరచించిన కావ్య ములలో నపరూపములుగాఁ జూపట్టు భావములను ఆంధ్రకవులు అనుకరించుటకో! అనువదించుటకో! పూనికొనవచ్చును.

జూలియస్‌సీజర్ అనురూపకమున ఆంథోని సీజర్ హత్యనుగూర్చి ప్రజాసమూహమున భావోద్రేక ముదయించు నట్లు చేసిన యుపన్యాసశైలి అసదృశభావగాంభీర్యశోభితమై వెలయుచున్నది.

అజ్ఞానగాఢనిద్రాముద్రిత మైయున్న సోదరసమూహ ముకు ప్రబోధించి, దేశాభ్యుదయమునకై పాటుపడునట్లు చేయుట కిట్టిగంభీరసాహిత్యరచనలు అత్యంతావసరములు మన పూర్వులగు కవిసింహులు నిజకవితాగర్జనములచే మందప్రజ్ఞమై యున్న స్వజాతిని ఆత్మాభిమానసంపన్నమునుగాఁ జేసిన ఘనోప న్యాసరంగము లనేకములు ప్రాచీనకావ్యములఁ గన్పట్టుచున్నవి.

భారతమునందు ఘోరాతిఘోర మగుద్రౌపదీవస్త్రాపహ రణము సంభవ మగుసమయమున దీనవదనయై ధర్మజిజ్ఞాసతో ఆసాధ్వీమణి చేసిన ధర్మమీమాంసకు ఆనాఁటిపేరోలగమునఁ గల సభాస్థు లెల్లరు బధిరులకీలని మూఁగుపల్కక జడులవలెఁ బడియుండుటను గాంచి, ఆపాపకార్యమును జూడఁజాలక, వికర్ణుఁ డనుబాలవీరుఁడు సభాస్థలిని నిలిచి, చేసినయుపన్యాసము ముద్దు లొలుకుచున్నది.

మఱియు రామాయణమునందు సీతాన్వేషణఘట్టమున జాంబవదాదివానరవీరులు ప్రాయోపవేశముచేఁ బ్రాణముల వీడఁ దలంచి, అంగదుని సుగ్రీవునిపాలి కేగి, హాయిగా నుండు మని బోధించినపుడు, ఆకపియువకవీరుఁ డాడినయభిమానోక్తులు శ్రోతల నుఱ్ఱూఁత లూఁగించురీతి నున్నవి.

భాగవతమునందు బాలభక్తుఁ డగుప్రహ్లాదుఁడు సహ పాఠు లగు దానవకుమారులకు చేసిన తత్త్వబోధలు యమ కింకరులనుగూడ దయూరసభరితులనుగాఁ జేయఁజాలియున్నవి.

కిరాతార్జునీయమునందు వీరవనిత యగుద్రుపదసుత పరాక్రమతేజమునుగూర్చి చేసిన గంభీరోపన్యాసము పిఱికి పందలనుగూడ పురుషసింహులనుగాఁ జేయఁజాలి యున్నది. ఈయుపన్యాసము నాకర్ణించునపుడు వార్ష్ణేయ్యసింగుని పరిపాలనము నెత్తిపొడుచుచు భర్తృమహాశయుఁడు చేసిన యుపన్యాసమునందలి భావసంపత్తి స్మృతికి వచ్చుచుండును.

శ్రీమతి గుమ్మిడిదల దుర్గాబాయమ్మగారు పురాణములఁగూర్చి యిట్లు వ్రాసియున్నారు.

"పుణ్యశీలు రగు మహీపతు లనేకులు స్త్రీల ధనమానప్రాణములను రక్షించుకార్యముల వారిసర్వస్వ మర్పించిరటుల పురాణములనుండి మన కనేకసాక్ష్యములు లభ్యము కాఁగలవు." (గృహలక్ష్మి.)

"భారతీయసాహిత్యానికి విజ్ఞానసర్వస్వాలైన పురాణాలు అద్భుతవిషయభాండారాలు."

(ఇంద్రకంటి హనుమచ్ఛాస్త్రి గారు—ప్రతిభ.)

సాహిత్యము దేశహితానుకూలముగా నుండవలయునన్న ప్రాచీప్రతీచీసారస్వతములయందలి యుదారాశయముల మేళగించి ఆంధ్రకవితావిపంచీగానమును సాగింపవలయును. అన్నియు మనసారస్వతముననే కల వని, మిన్నకుండరాదు; అన్నియు నన్యవాఙ్మయముననే కల వని, పరుఁగిడరాదు; గ్రాహ్యతాగ్రాహ్యతలఁ బరిశీలించి, కలముల నడిపింపవలయును.

## —♦ సా హి త్య వి భా గ ము ♦—

కవితాజనకుఁ డగు నన్నయభట్టారకుఁడు మొదలు నేఁటి వఱకు వ్యాప్తినిఁజెందియున్న సాహిత్యమును సభ్యాసభ్యనామములచే ద్వివిధముగా విభాగింప నగును. పావనభావముల వర్ణించి, సోదరసంఘమునకు గౌరవానందవిజ్ఞానముల నందఁ జేయునది సభ్యము. హేయామంగళవిషయముల వెలువరించి, నీతిధర్మముల మాపునది అసభ్యము.

సాహిత్యమున కింతటిశక్తి కలదా? యని సంశయింపకుఁడు. సంఘమునకు బాగోగులఁ గలిగించునది సాహిత్యమే. సందియము లేదు. వినుఁడు: పింగళి నాగేంద్రరావుగారి నిర్వచనమును. "ధర్మనిర్దేశం చేసి జాతిని ఆధర్మజీవనోన్ముఖంగా దిద్ది సంస్కరించగలిగేది సారస్వతమే". (సావిత్రీప్రవేశిక.)

ముందు సభ్యసాహిత్యసృష్టి ద్రష్టల నెట్లానందడోలికల దూఁగాడించునో! అట్టిఘట్టములఁ గొన్నింటిని ఉదహరింతును. కనుఁడు: తపస్విఁడి కచుఁడు, దివి కేగనున్నపుడు దేవయాని వేఁడికొన్న జాలినుడులఁ జూడుఁడు. నన్నయ—

ఉ. నీవును బ్రహ్మచారివి, వినీతుఁడ వేనును గన్యకన్ మహా
దేవకులావతంస! రవితేజ! వివాహము నీకు నాకు మున్
భావజశక్తి నైనయది; పన్నుగ నన్నుఁ బరిగ్రహింపు సం
జీవనితోడ శుక్రు దయఁజేయుము నాకుఁ బ్రియంబు నావుడున్.

కీచకుఁడు నీచహృదయుఁడై ద్రౌపదిని గోర సుధేష్ణ చేసినసుబోధ నాలింపుఁడు. తిక్కన—

గీ. ఆయురైశ్వర్యకీర్తుల నపహరించు
పరసతీసంగమము ధర్మపథమునందుఁ
బరఁగువారలు పరిహాసింపంగఁ గనియు
వినియుఁ దెలియవె యిది దుర్వివేక మాట.

బాలగోపాలుని మనోహరోక్తుల నాలింపుఁడు. పోతన—

శా. అమ్మా! మన్ను తినంగ నే శిశువునో యాఁకొంటినో వెఱ్ఱినో
నమ్మంజూడకు వీరిమాటలు మదిన్ నన్నీవు గొట్టంగ వీ
రిమ్మార్గంబు ఘటించి చెప్పెదరు కాదేనిన్ మదీయాస్యగం
ధ మ్మాఘ్రాణము చేసి నావచనముల్ దప్పైన దండింపవే.

సీత గడ్డిపోఁచ నడ్డముగా నిడి, రావణునకు చేసినహిత బోధ నాలింపుఁడు. భాస్కరుఁడు—

చ. వినయముతోడ నన్ను రఘువీరున కిచ్చి వినమ్రుఁడైన నొం
డనియెడువాఁడు గాఁడు శరణాగతవత్సలుఁ డాదయాళుతో
ననువుగ సంధి చేసికొని యాదటమై బ్రతుకుండు నీవు నీ
జనములుఁ గ్రొవ్వి చచ్చుట విచారము కా దటుగాక తక్కినన్.

శ్రోత్రియశిఖామణి యగు విప్రకుమారుఁడు సన్మార్గ నిరోధిని యగువరూథిని యసభ్యపరిరంభసౌఖ్యము నెట్లు తృణీకరించెనో కనుఁడు. పెద్దన—

ప్రాంచద్భూషణ బాహుమూలరుచితోఁ బాలిండ్లు పొంగారఁ బై
యుంచుల్ పోవఁగఁ గౌఁగిలించి యధరం బాసింప హా! శ్రీహరీ!
యంచు న్బ్రాహ్మణుఁ డోరమోమిడి తదీయాంసద్వయంబంటిపో
మ్మంచున్ద్రోచెఁ గలంచునే సతులమాయల్ ధీరచిత్తంబులన్.

మగని వీడి పరుని వేడఁబోవుమగనాలికి నాచ చేసిన సుబోధ—హంసవింశతి—

సీ. పంక్తికంఠుని మోహపరితాప మెంచెనే
భువనమాత జగత్పవిత్ర సీత
యలపుళిందుని బొంద నాసక్తిఁ జెందెనే
ప్రియహితామితనయ భీమతనయ
నహుషునివిరహంపుదహనహాల్ చూచెనే
సాంద్రసద్గుణచర్య యింద్రుభార్య
మఱి సింహబలుని పెన్మాయలఁ జిక్కెనే
యాఱడిపనిఁ బూని యాజ్ఞసేని
మునుపటిపతివ్రతలు మహామూర్ఖచిత్తు
లైనదుర్జను లతిఘోరసూనసాయ
కాస్త్రజర్ఝరితాత్ములై యాసపడిన
మాన ముడిపుచ్చుకొనిరఁటే మచ్చకంఠి.

స్వభావగుణము అనుల్లంఘనీయ మనుటలో, కాశీభట్ల బ్రహ్మయ్యశాస్త్రిగారు, మంగతాయి—

గీ. సదమలమ్మృణాళముల కంచ సరసుఁ జేర
మధురమకరందముల కళి మధుగుఁ జొఱఁగఁ
గొంగ నత్తగుల్లలకయి కొలను జొచ్చు
వారివారికిఁ దగురుచుల్ వఱలు నిల్లె.

సుగుణమే యలంకార మనుటలో, పిచ్చయ్యశాస్త్రిగారు --

గీ. ఒడలిసింగారమును, పైతొడవు లున్న
యువిద ఘనత గాంచి లేకున్న సుదతి
ఘనత గాంచకపోవునా కాంతలకును
తొడవు లేటికి గుణ మొండె తొడవు గాక.

—♦ అనుతాపము ♦—

తడఁబడుగుండెతో నెదురుదారులు సూచుచు నిల్చి నిల్చి, యె
వ్వ్యేడకును జాడఁ గానమిఁ జెలీ! ననుదూఱితొ,దూఱుకొంటివో
పడమటిగాడ్పుదెబ్బ తిని, వాడినతీవవిధమ్మునన్ బడ
ల్పడి వసివాడి కుట్టిమముపైఁ బడి కన్నులు తేలవైచితో.

(సౌందరనందము.)

—♦ నెలయేటిగానము ♦—

గీ. దుష్టసంకల్పకర్శితాత్ములకు నెట్లు
పావనస్త్రీప్రసన్నభావమ్ము లెల్లఁ
బ్రకృతిపూర్ణత్వమునఁ గన్పట్టఁగలవు
నిజమనోనుచింతనపాపనిఁమతి కాక.

(అబ్బూరి రామకృష్ణారావుగారు.)

### అపవాదము

పూర్ణచందురుఁ బోలు నెమ్మోమువాని
చంద్రికల నీను మందహాసంబువాని
కలువరేకుల నేలు కన్గవలవాని
రాము విడనాడి నేనింక బ్రతుకఁగలనె?

(నాళం కృష్ణారావుగారు.)

### రాధ

దూరముననుండి నీమురళీరవమ్ము
హృదయమున సోఁకినంత మే నెల్ల మఱచి
తిరుగుచుంటిని యమునానదీవిశాల
పులినసీమల వెఱ్ఱినై పోయి నేను
ప్రకృతి పులకింప యమునాస్రవంతి పొంగ
రాగవల్లిక చిగురింపఁ బ్రణయగీతి
పాడి ననుఁ గౌఁగిలించి గోపాలకృష్ణ!
ప్రేమ దీఱఁగ నొకముద్దు పెట్టుకొనుము.

(వేదులవారు.)

### నక్షత్రమాల

గోపికామోహనుఁడు నందగోపసుతుఁడు
వచ్చు నీదారి నని సఖి పలుక నిచటఁ
బ్రొద్దువొడువున నుండి యీపొన్నక్రింద
వేచి వేచి యీదారులు చూచుచుంటి.

—♦ వా ల్మీ కి ♦—

ఓ యాదికవిరాజ! ఓ దివ్యవాగ్మి!
యెన్నియేండ్లును బూండ్లు నేగెనో కాని
మున్ను హిమాలయమోహనాటవుల
నీవు మీటిన కావ్యనిర్నిద్రవీణ
నేఁటికి వినఁబడు నిఖిలదేశముల.

(దువ్వూరి రామిరెడ్డిగారు.)

—♦ ము ర ళీ ధ్వ ని ♦—

గోవులను వీడి యరుదెంచె గోపజనము
కుడుచులేఁగల విడివచ్చె గోగణంబు
పరుగుపరుగున నీపాదపదముఁ జేర
ప్రియుని విడనాడి వచ్చె గోపీమనోజ్ఞ!

ఇంతటితో నీసభ్యసాహిత్యమును ముగించి సల్లక్షణముల నిర్లక్ష్య మొనర్చి, క్రొత్తపుంతను విచ్చలవిడిగాఁ బరువిడుచున్న యసభ్యసాహిత్యసృష్టి యెట్లు సంసారులఁ దహతహ లాడించు చున్నదియో తెలుపుటకుఁ గొన్ని చిన్నికతలనుండియు నేకాంకి నాటకములనుండియు ఖండపద్యములనుండియు నుదాహరణ ములఁ జూపుదును.

ఈ యసభ్యకావ్యనిర్మాతలు ప్రకటించిన కథ లన్నియు నించుమించుగా అవినీతిరీతులనే వెలిపుచ్చుచున్నవి కాని, శీల సంపదను వృద్ధిచేయఁజాలినవిగాఁ జూపట్టవు

ప్రభాకరకిరణము నలినముకుళముపైఁ బడినతోడనే దానిని వికసింపఁజేసి, లక్ష్మీనివాససుందరముగాఁ జేయునట్లు, కథావర్ణనము కర్ణపుటమునఁ బడినవెంటనే హృదయారవిందము వికసించి, సుగుణసంపన్న మగునటులఁ జిత్రింపవలయును.

"శ్లో॥ స్ఫురత్కలాలాపవిలాసకోమలా
కరోతి రాగం హృది కౌతుకాధికం
రసేన శయ్యాం స్వయ మభ్యుపాగతా
కథాజనస్యాభినవా వధూ రివ।"

అనఁగా నవ్యక్తాలాపములచేఁ బ్రణయరసముఁ బ్రకటించుచు స్వయముగా శయ్యాతలమున కేతెంచిన నవీన కాంతవలె కథాకవిత హృదయాకర్షకముగా నుండవలయు నని భావము.

—♦ అ స భ్య వా క్య ర చ న లు ♦—

"లొత్తలుపోయిన ఆ రోజాబుగ్గలులోంచి నవ్వు యెప్పుడూ చిమ్ముతూ వుంటుంది." "ఈసౌందర్యం నాప్రక్కను కూచుని నన్ను దూరాన్నుంచి యేడిపిస్తోంది" "నావంక అతి నాజూకుగా చూసింది." "నీ కటాక్షామృతంలో రాలే చినుకులను తాగనీ" "ఆ ముఖకమలంపైని చిరునవ్వు భగ్నమంటి. నాగుండె జారింది" "ఒక్క స్త్రీ హృదయం యింత వుప్పుత భక్తిని, ప్రేమను, వెలిగించిన నా కవిత్వం." "ఆకిటికీదగ్గర నిల్చొని సుదూర పరిసమాప్తమైన ఆ అడవిచివర" "వెన్నెల

తేఁడు తన మధురకిరణాల్ని ఆకిటికీగుండా పంపిస్తూన్నాఁడు.” “మోహిని ముఖకమలమునుండి వినిర్గతసౌరభజావళీలు వాయు కెరటములపై నెక్కి నల్దిక్కులఁ బ్రసరించినవి” “ఆమొగుం మీఁద చిరునవ్వు వెలిగింది, నాగుండెలో దడదడ తోలగింది” ఈరీతి అపభ్రంశవాక్యరత్నము లీయసభ్యసాహిత్యసాగరమున కుప్పతిప్పలుగాఁ జూపట్టుచున్నవి

—♦ సంధులపసందు ♦—

పదములఁ గలుపునపుడు పాటింపఁదగు సంధిమర్యాదలఁ ద్రోసిపుచ్చి నవ్యసాహిత్యాభిమాను లెట్లు క్రొత్తసంధుల సంఘ టించుచున్నవారో కనుఁడు:

“పిలిచి విచ్చేడు, వచ్చుచూ వుండేవాడ్ని, ఆ వెండ వేడికి వొళ్లు మండింది, తప్పక విస్తావా” ఈరీతిగా వడాగమ వడగండ్లవానలు కవితాలతావితానములపై విరివిగాఁ గురియు చున్నవి.

ఈవేఁడివడాగమువైఖరిని జూడ వెనుకటికథ యొకటి స్మృతికిఁ దట్టినది. అది యేది యన, వెంగళయ్య యను నొక దేవాంగి ఏళ్ల ఇంద్రయ్య అను వంటరియింటికడ కేగి తన తెలుంగుబాససొంపు వెల్లడింప నిట్లడిగెనఁట. “వేళ్ల వింద్ర య్యా! వేబులం ప్రొగాకు వైదు డబ్బులా, వారు డబ్బులా, వేడు డబ్బులా, వేలా విస్తావు?” అన ఆకొంటెవంటరి యిట్లు

పలికెను. "వహో వెంగళయ్యా! ప్రేమి తెలుంగురా! వీలా వెవసు వంటాఁడురా! వీవొక్కఁడవు తప్ప. కాని విప్పుడు విక్కఁడ ప్రాగాకు వమ్మటం వాపేశాం, వంగడిలో వమ్ముతోన్నాం" అనినాఁడఁట.

లలితసుందరము లగు తేటతెనుంగుకైతలలో నపభ్రంశ సంధిపదముల గుప్పించుట యన వంద్యాంధ్ర భారతీసుందరమందిరములపై ఆకాశయానములనుండి అగ్నిగోళముల వర్షించుట కాక మ ఱేమగును? ఇదియా! ఆంధ్ర భాషాభిమానము? ఇద్దియా! లలితకవితానైపుణ్యము? అదేమికలికాలదోషమో కాని! చక్కని భాషాసౌష్ఠవముతో ముద్దుగా వ్రాయ సమర్థులగుసోదరులుకూడ కవితలలో నపభ్రంశరూపములఁ బ్రయత్నపూర్వకముగా వాడుచున్నారు.

దీనివలనఁ గలుగులాభ మేదియో తెలియవచ్చుట లేదు. అనాయాసముగా విషయము బోధపడుట కంపురా? అది సుశబ్దప్రయోగమువలనఁ గలుగును కాని అపశబ్దప్రయోగము వలనఁ గానేరదు వీరు ఒకఁడు అనుపదమునకుబదులు వహాడు, వొహాడు, వఘడు, వొకడు, వోడు, అను వివిధరూపముల వాడుచున్నారే! వీనిలో ఒకఁడు అనుమాట అర్థమగుటలోఁ క్లిష్టతయు, తదితరపదము లర్థ మగుటలో సరళతయుఁ జూపట్టుచున్నదా? ఇట్లనేకపదములఁ దలఁ ద్రుంచియో, మొలఁ జెంచియో వికారములనుగాఁ జేయుచున్నారు.

ఈనవ్యసాహిత్యభాషాదోషములఁగూర్చి శ్రీ శ్రీ జయపురమహారాజావా రేమివ్రాసిరో చూడుఁడు.

"ఇప్పటికవులలోఁ గొందఱు పట్టుపట్టి యున్న నీమముల నతిక్రమించి, భాషను బాడుసేయుచున్నారు మఱికొందఱు వచించునట్లు వ్రాయవలె ననుచున్నారు. అట్లనుట తగదు."

(ఆంధ్రపరిషద్రజతోత్సవసంచిక.)

## —♦ సాయంకాలవర్ణనసౌభాగ్యము ♦—

భారతమున-"వాఁడిమయూఖముల్ గలుగువాఁడపరాంబుధిఁ గ్రుంకె ధేనువుల్ నేఁ డిట వచ్చె" అని వర్ణింపఁబడి యుండ ఆధునికకవిశిఖామణి యెట్లు వర్ణించెనో కనుఁడు:

"ఎద్దులు సూర్యుడికి పృష్ఠభాగము చూపించి వింటికి మళ్లుతున్నవి." ఓహో! ఏమి యీక్రొంగయితహొయలు! తూర్పునుండి పడమటి కేగు నెద్దును, పడమరనుండి తూర్పునకుఁ బోవు ఆఁబోతులునుగూడ ఒకసారి సూర్యుడికి పృష్ఠమును జూపుట ఆయూరి యాచారమో! లేక తూర్పున పొలములు లేవో! తెలియదు. ఉన్నచో నటనుండి వచ్చు ఎద్లు సూర్యుడికి మొఖముల జూపఁగలవు గాని పృష్ఠముల నెట్లు జూపఁగలవు? ఇట్టిపిచ్చివ్రాఁత లెన్నియో కలవు.

## —♦ పయోధరవర్ణనము ♦—

నన్నయాదికవివరులు కుచకచాదులను, బాహుమూలములను, కటిప్రదేశములను వర్ణించి, పాఠకుల కుద్రేకము

కలుగునట్లు వ్రాసి రనియు, అట్టిఘట్టములు కావ్యముల నుండ నర్హములు కా వనియు, మననవనాగరకపుంగవులు దీర్ఘోపన్యాస ములఁ జేయుటయేగాక, అట్టిపాత్రముల అచ్చొత్తించునపుడు కుచాదుల నెత్తివేసియున్నారు. ఇపు డీయిరువదియవశతాబ్దిని అసభ్యసాహిత్యమున పాలిం డెట్లు చిత్రింపఁబడియున్నవియో కనుఁడు: "జోడుగుండ్లబారన నెదదోచె క్రొత్తచనులు." "నా చేతిని పట్టుకుని తనరొమ్ముమీద ఆనించుకొంది." "ఆ వెచ్చని గట్టివక్షంమీదనుంచి నాచెయ్యి వచ్చునా?" "వంగితే పైట వదులై నాయవ్వనపురొమ్ములమొనలు బాడీని ఆనేవి."

ఓహో! ఏమియీకుచసౌభాగ్యము! యౌవనపురొమ్ముల మొనలు బాడీని ఆనుట యేమిటి? "బాడీ" అన నాంగ్లపదమా? అగుచో శరీర మని కదా యర్థము. అపుడు కుచంబులమొనలు శరీరమునకుఁ దాఁకిన వన వాలిన వని కదా భావము. అట్లయిన "యౌవనపు" అనువిశేషణము గంగలో మునుంగు నే! "బాడీ" తెలుఁగునుడికార మైనచో "బాడిని" అని యుండవలయును కాని "బాడీని" అని దీర్ఘ మెట్లుండును? వయ్యాకపులుకనుక బాడి దీర్ఘించిన దనుకొందము. అప్పు డాయువతి వంగినచోటు బాడి కల దని బోధపడును. పరిశీలింప తప్పక నాయిక జేవడి చేలో నూ డ్పూడ్చుచుండఁగా పైట వదులై యుండును. అంత కంచుకాంతరంగమున మదనతాపముచే నుడుకుచున్న కుచశిర ములు మెత్తనై మడిలోని దమ్ములోఁ దల దూర్చియుండును.

తప్పక వాడీ తెలుఁగుమాటయే కాని ఇంగ్లీషువద్దు కాదు. నవ్యసాహిత్యనిర్మాతలు తెలుఁగుప్రియులు; కావున నాంగ్ల మును దరికి రానీరు. తల్లి యగుసంస్కృతమును దఱిమివేయు ధీరులు తెల్లపలుకులసొబగులకుఁ గులుకుదురా ?

"అప్పుడప్పుడే వుబుకుతూన్న వక్షోజములు జారిపో తూన్న పమిటిలోనుంచి తొంగి చూస్తున్నాయి." "తన ముకు ళితదేహాన్ని పూర్తిగా రగ్గులోనికి దూర్చేసినా ఆమెయొక్క నున్నని వంపులు తిరిగిన సమున్నత వక్షస్తలముమీద" ఇట "వక్షస్థలం" అంటే లక్షణార్థముచే వక్షోజము లర్థము. ఆహా ! యేమి యీయుయోమయుపయోధరసౌందర్యము ? సమున్నత వక్షస్థలం హాస్యగానిచేతికఱ్ఱవలె వంపులు తిరుగునా ? ఈరీతి వంకరపాలిండ్లు యువతుల కున్నట్లు భారతదేశమున నిదివఱ కేకవియు గుర్తించియుండలేదు. వీరికవిత్వము వంకరతిరిగినట్లే స్తనములు వక్రించుచున్నవి. లేక హూణకవి యెవఁడైన పయో ధరముల నిట్లు వర్ణించియున్నవాఁడేమో ! హూణానుకరణము మననవ్యులకు ప్రాణము. అందుచే నీవంపులు తెల్లవారినుండి సంపాదించినవై యుండును. ఆంగ్లమున "వంపులుతిరిగిన" అనఁ బరిణతిసుందరములైన అని యర్థము. మనబాసలో నట్టియర్థము లేదు. వర్తులములైన, పరిణామకలితములైన, వికాసవంతములైన లోనగుపదముల వాడవలసియుండును. అంతియకాని వంపులు తిరిగిన, మెలికలుతిరిగిన, అను విశేషణముల వాడుట ఆర్యాభి రుచి కనువగు వర్ణనము కాదు.

"అందమయిన నా వక్షఃపుఫుబుకును ఆచ్ఛాదితమైన నా సౌందర్యాన్ని సూచించేట్టు నా జాకెట్టుమెడలు బాగా కిందికి కత్తిరించాను."

"నేను నాపైట పక్కకి తొలిగించి నవ్వాను... చెయ్యి వూపాను." ఇట కవిశేఖరుఁడు నాయికపైఁటను పక్కకి తొలఁగించి, చిత్రించుటలోఁ గలమును వాడెనేకాని, కులస్త్రీ మర్యాదాసంపదను గాపాడుటలోఁ గన్ను లుపయోగింపఁడాయె.

కట్టా! కృష్ణపక్షమునఁ గ్రమముగా విబుధానందసంధాయిని యగుచంద్రిక సన్నగిలునట్లు ఈనవ్యసాహిత్యమున సజ్జనసంతోషావహ మగు సతీశీలము క్షీణించుచున్నది. కులయువతులు నిజప్రణయావిష్కరణముల సుందరమందహాసముల మూలముననుం, మనోహరభ్రూవిలాసలాస్యముల చేతను, తేనెసోనలవంటి వాల్గంటిచూపులతోడను, భావగర్భితము లగు సంభాషణములవలనను, హృదయరంజకము లగు ననురాగలేఖల ద్వారముననుం, వెలిపుత్తురు కాని, వెకిలినవ్వులతోడను, వెఱ్ఱిచూపులతోడను, మర్మప్రకటనములతోడను, చేతియూపుల తోడను, పోలికేకలతోడను వెల్లడింపరు. వినుఁడు: విన్నకోట పెద్దన్న యేమన్నాఁడో?

"చ. ఇల వలరాజురూపునకు నెక్కుడ యయ్యెడు విశ్వమేదినీ
లలనుని రూపయౌవనవిలాసములం జెలి మాటు జేరి య

గ్గలికపుసిగ్గు వేడుకలక్రందున కడ్డుపడంగ నిమ్ములన్
మెలఁతుక వాలుఁజూపులకు మేపులు వెట్టెడు చూచి తేసఖీ!"
(కావ్యాలంకారచూడామణి.)

ఈపద్యమునఁ దెలిపినటుల శృంగారచేష్టల యువతీమణులు సిగ్గుతెరమఱుఁగునుండి సరసముగఁ బ్రకటింప నగును.

"శృంగారం కేవలం పశుతుల్యమైన వ్యాపారము కాదు" అని ఒకప్రాజ్ఞుఁడు తెలిపియున్నాఁడు. మఱియొకకవివరుఁడు—

"ఆమెసొగసు రేకులు విచ్చి యమృతమధుర
నటన వాసింపఁ బోదు, గానమ్ము సేయు
దామెప్రాయంపువాకిళు లందు వలపు
తడఁబడి యడంగు సిగ్గుదొంతరల తెరల."

వేశ్య యగు నూర్వశికే యింతటిసిగ్గుదొంతర తెరలు అడ్డుగా నుండఁ గులీనకన్యలకు మఱెంతటిసిగ్గుబొంత తెరలడ్డగునో తెలుపవలయునా? సిగ్గు విడిచి, గోప్యభాగములు వెలిపుచ్చునవి పశుజాతిస్త్రీవ్యక్తులు కాని, మానము గల మానవజాతిమహిళాసంఘములు కావు.

మఱియు భర్తృహరిసుభాషితమున యువతీశృంగారముల యొక్క హొయలు లెంతచక్కఁగా వర్ణింపఁబడినదియో కనుఁడు:

చ. చెలువపుఁదేటలేనగవుచేతను భావముచేత సిగ్గుచే
నలు వగులీలచేత సుగుణంబులచేఁ గడకంటిచూపుచేఁ

గలహాముచేత విందు లగుకందువమాటలచే నసూయచేఁ
బెలుచన నెంతవారి వలపింతురు కాంతలు పెక్కుభంగులన్.
(ఏనుఁగు లక్ష్మణకవి.)

ఉత్తమకులజనిత లగుకన్యకామణులు కామపీడిత లయ్యు నీతిమారము లగు నసభ్యప్రణయకార్యములకు లోను కారు.

"దుర్వారాః స్మరమార్గణాః ప్రియతమోదూరేమనోత్యుత్సుకం।
గాఢం ప్రేమ నవంవయోతికఠినాః ప్రాణాః కులం నిర్మలం
స్త్రీత్వం ధైర్యవిరోధిమన్మథసుహృత్కాలః కృతాంతోక్షమీ
నో సఖ్య శ్చతురాః కథంనువిరహః సోఢవ్య ఇత్థ శఠః॥"

ఇంచుమించుగా నీశ్లోకభావమునే వ్యక్తము చేయు నాంధ్రపద్యము నాలింపుఁడు.

"వనజాతాస్త్రుకుఁడేయుసాయకముల న్వారింపఁగారాదు నా
తనబాల్యాధికయౌవనంబు మదికిన్ ధైర్యంబు రానీదు ది
ట్లనురక్తి న్నిముబోంట్లకుం దెలుప నాహా సిగ్గు మైకోదు పా
వనవంశంబుస్వతంత్రమీయదు చెలీ! వాంఛ ల్తుదన్ముట్టునే?"

"నా తలతో ఆ స్తనాలను కుమ్మివేసేవాడ్ని" ఈసరస శృంగారకార్యము నాచరించిననాయకుఁడు బి. ఏ., తరగతిలోఁ జదువుచున్న బ్రహ్మచారి. బ్రహ్మచారిమాత్రము శృంగార నాయకుఁడు కాఁగూడదా? యందురా? కావచ్చును అగు చున్నాఁడు కాని లేగదూడ మొదవుపొదుగును తలతో గ్రుద్దు

నట్లు నాయకుఁడు గుచములఁ గ్రుమ్ముటమాత్రము వింత యగు క్రొత్తపుంత!

అసలువిషయ మే మందురా? ఈవిద్యార్థికి అన్నమ్మ యనే వంటపూఁటియిల్లాలు తలయంటుచుండెడిది. అపుడు తల వంచి, పీటమీఁద కూర్చున్న యీ బి. ఏ. సరసుఁడు వంగి, నూనెతోఁ దనతలను మర్దించుచున్న అన్నమ్మకుచకుంభము లను తల పై కెత్తి కుమ్ముచుండెడువాఁడు. ఈవిద్యార్థివీరుఁడు హయాణకళాశాలలోఁ గాలిబంతియాటయందు ఆరితేరిన మొన గాఁడగుటచేఁ గుచకందుకములఁ దలతో నెగరఁగొట్ట సమర్థుఁ డాయెను. లేకున్న సామాన్యవిద్యార్థి కీప్రావీణ్య ముండునా?

## —♦ అసభ్యభావములు ♦—

సాహిత్యమునఁ జిత్రింపవలసిన విషయములు శ్రావ్య ములుగను, హృద్యములుగను, పావనములుగను, శ్రేయస్కర ములుగను, వివేకప్రదములుగను ఉండవలయును; కాని కటు వులుగను, కలుషితములుగను, అపయశస్కరములుగను, అజ్ఞాన హేతుకములుగను ఉండరా దని, సాహిత్యతత్త్వవేత్తలు బోధిం చియున్నారు.

నవ్యసాహిత్యమువా రీబోధల నుల్లంఘించి, ఎవ్వి సంఘమునకుఁ గలంకమును గొనిరాఁగలవో, అట్టి యసభ్య విషయములనే ప్రకటించుచున్నారు.

ఇందుకుఁ గొన్ని యుదాహరణములఁ జూపెదను. న్యాయముచే నిక్టష్టమంగళవిషయముల ముట్టరాదు. అయినను గుణాగుణములఁ దెలియఁజేయుటకు వ్రాయఁబడిన గ్రంథమగుటచేఁ బ్రకటింపక తప్పదు.

"అతనివంక చూడడం, దగ్గిరకి లాక్కోడం, ఒళ్లు మరచి అనుభవించడం అంతే పని."

"ఆ సాయెబు ఆమెను వెల్లకితలా తిరగదీసి బలింగా కావలించుకొని నున్నని మెత్తని ఆమెచెక్కులు ఎర్రనయ్యేలా ఆపెదిమెలూ సోగకళ్లమీదా ఎన్నో ముద్దులు......సాయెబు కావలింతల్లోంచి ఆమె లేవలేకపోయింది."

ఆహా! ఏమి యీజాను తెనుఁగుకథలు? ఎంతటి పావన భావము! "లజ్జా మేకాం పరిత్యజ్య త్రిలోకవిజయీ భవేత్" అను శ్లోకభావము నాధారముగాఁ జేకొని, నవ్యకవులు అసభ్యకార్యముల వర్ణించుచున్నారు.

"ఆమె నన్ను వెఱ్ఱిగా భయంకరంగా మోహం చూపి ప్రయోగించుకొనేది."

"కఠినంగా పట్టుకొని సార్వభౌముడివలె తనని రెండు నిముషాలలో రంజింపజేయగల భర్త."

"మొన్న ఆవుపెయ్య ఎంత కష్టపడ్డది. అది చూచి వెంటనే ఎద్దును తెప్పించారు......నేను ఆసౌఖ్యం సంపాయిస్తా నంటే పెళ్లి కెందుకూ కోపం."

ఈయసభ్యవాక్యము లోకవితంతుసోదరిచేఁ బలికింపఁ బడినవి. పశుసంగమములఁ గాంచి, అట్టిసౌఖ్యము మనకు లేక పోయెనే! యని దుఃఖపడు నీచాశయులు మనదేశమునఁ గలరా? ఇట్లు వితంతువుల జంతుతుల్యలనుగాఁ జిత్రించుట భావ్యమా? ఇట్టి మీాకా! రామాయణాదులలోని నీతులు పనికిరాకుంట?

"నేను నెత్తిన కడవ పెట్టుకు పోతుంటే అందరు ఆనం దంతో రసస్రావం చేస్తున్నావని హర్షించువారు."

"అన్నమ్మ యెంతో బాధతో అబ్బ...అమ్మ...అని మధ్య మధ్య అంటూ ఎక్కడివాడివోయ్...ఆబోతు...పాడు మోటుసరసం......అంబోతు......అనటం సాగించింది."

"వుక్కుతునకలావున్న అతని దేహాన్ని శ్యామల నిము రుతూ సుబ్బూ...నెల తప్పింది" కాంచితిరా? యీాయసభ్య సాహిత్య మెట్లు జుగుప్సావహాముగా రచింపఁబడుచున్నదియో! "కామాతురాణాం న భయం న లజ్జా" అనునట్లు ఈనవకవులు మాటలతో బూతుచేతల వెల్లడించి, తనివి తీఱకకాఁబోలు! తమకైతలలో మాటలకు నడుమ చిరుసిరామరకల నలంకరించి, మిథునకృత్యములఁ బ్రకటించుచున్నారు.

ఈనాఁటి నవ్యసాహిత్యప్రియులకుఁ బశుకామవిలాస ప్రకటనమే కావ్యనిర్మాణమునకు గమ్యావధిగాఁ గానవచ్చు చున్నది. ఈయసభ్యశృంగారవర్ణనములఁగూర్చి శ్రీ నోరి నర

సింహాశాస్త్రిగారు ప్రతిభలో "కావ్యప్రయోజన" మనువ్యాస మునఁ గొన్ని వాక్యరత్నముల వెలయింపఁజేసియున్నారు.

"ఐరోపామహాసంగ్రామానంతరము కవులందరికి ప్రత్యేకముగా మైథునప్రసంగముమీద అభిమానము ఎక్కువైనది. అది మన తెలుగుకవుల వ్రాతలలోకూడా మరీ మితిమీరి పోవుతూ వున్నది. (ప్రతిభ—జూలై, 1937.)

ఇఁక జ్వాలఁ బరికించువారలకుఁ బరనారీనగ్నసౌంద ర్యావలోకనభాగ్యము భూతదర్పణమునందువలెఁ బ్రత్యక్ష మగును. కొంచెము శృంగారమాధుర్యమునుగూడ మచ్చు చూపుదును.

"ఆచార్యకీ ఔరత్" అనుకథలో నీలకంఠం అనేవిద్యార్థి కుఁడు కిటికీకడ కేగి, దిసమొలతో జలకమాడుచున్న పరభార్య యగుతాయారమ్మను చూచును. ఆవెంటనే చెలరేఁగినప్రణయ జ్వాల యిట్లు వర్ణింపఁబడినది. "ఆతనిమనస్సు గోడ దాటి వెళ్లింది. ఒక గోడ దాటడం ఏమిటి ? మహోన్నత పర్వతాలూ, గభీర సముద్రాలూ, విశాల ఆకాశాలూ కూడా క్షణంలో దాటి వెడుతుంది మనస్సు. వెనుకటిరాత్రి ఆవిడన్న వాక్యం మళ్లీ జ్ఞప్తికి వచ్చి, ఆతని మానససరోవరాన్ని కెలికింది; తక్షణం తుపాను రేగింది." ఇట్లు తుపాను చెలరేఁగడంతోడనే నీలకంఠ కంఠీరవుఁడు లేడివలె వడిగ గవాక్షముకడకుఁ బరుఁగిడి, "సావ కాశంగా కన్నుల కరువు తీరేటట్టు తాయారమ్మ తనుశోభ దర్శించాడు."

కంటిరా ? నవ్యకావ్యనాయకుల యోగ్యత ! వింటిరా ? మానసంపుకోలఁకుల కెలుకులు! చూచితిరా? తుపాను శేఁగుళ్లు! పరభార్యానగ్నావయవావలోకనముచే నాయకుఁ డగు నీలకంఠుఁడు కంఠము తెగిన కోడిపిల్లలాగునఁ గొట్టుకొన్నాఁడు. మృత్యుంజయునికిఁ బర్యాయుఁ డగుటచే జీవింపఁగలిగెను కాని, లేకున్న మరణించి, యమున కతిథి కావలసినవాఁడే కదా ?

ఇట నీలకంఠుఁడు దిసమొలసొబగు నవలోకించి, ప్రణయ ప్రళయపయోధితరంగరంగముల దోదూయమానమానసుఁడై నాట్య మాడుటకుఁ గారణ మే మైయుండునో ! ఆఁ ! తెలిసె ! ముక్కంటికి బట్టలేకుంటయే పసం దగువిందు. ఎందువలన ? ఆతఁడు దిగంబరుఁడు కనుక. ఏజాతివా రాజాతియభిరుచులు కలవారై యుందురు కదా ? అందువలన పశుపతినామముల ధరించు శివశంకరనీలకంఠాదులు నాయకు లైనచో బోడిమొల బ్యూటీని హైగా తింకింతురు. లేకున్న నీబట్టలెస్ సౌందర్య మింతగా గ్రంథరాజములఁ బండితకవులు చిత్రింతురా ?

అసలు సావకాశముగాఁ గన్నులుకఱవుదీఱ నీలకంఠము చూచిన అపరూపపదార్థ మేది ? తాయారమ్మ పృష్ఠభాగము. ఈనీలకంఠానికి వీఁపుసోయగమే యింత కన్నులవైకుంఠముగా నుంటే ! ముందఱి భాగ మెంతటి విందుగొలుపునో! నిజముగాఁ గవి దయామయుఁ డైనచోఁ దాయారమ్మను గిటికీవైపు త్రిప్పి, ఫ్రంటు బ్యూటీ కంటఁబడవేసి, నీలకంఠానికి శివసాయుజ్య మొదఁ జేసి యుండును.

ఈ కవిగారుకూడ నొకప్పుడు స్తంభసవిధమున నిల్చి, ప్రియురాలి శాంతమనోజ్ఞరూపమును దనివితీఱఁ జూచినట్లు వ్రాసికొనియున్నారు. స్తంభముచాటునుండి చూచుటచే ఇది కూడ దిగంబరసౌందర్యమే యైయుండును.

ధర్మదృష్టితోఁ బరికింపఁ గావ్యములయందు స్త్రీలనగ్న రూపములఁ జిత్రించుట యర్హము కాదు. వినుఁడు తులసీ దాసుని బోధలు: "విధువదనీసబభాంతిసవారీ సోహానబసన బినాబరనారీ" అనఁగా స్త్రీ సర్వాలంకారశోభిత యైనను వసన విరహిత యగుచో దర్శనీయ కాదు అని భావము.

శ్రీ ఇంద్రగంటివారి వాక్కులు వినుఁడు: "కళలను మలినపరచే అసభ్యఘట్టాలు, అవినీత్యుపన్యాసాలు, నగ్నశృం గారం, రసదోషాలు చాల ఉండడంచేత ఏవిధంగానూ దానిలో ఉత్కృష్టానందం లేదు. లాలసులు తప్ప సహృదయులు మెచ్చుకోలేరు." (ఉదయిని.)

తాయారమ్మపృష్ఠభాగముపైఁ బడినదృష్టివాహిని యెట్లు వర్ణింపఁబడినదియో చూడుఁడు.

"ఆతని దృష్టివాహిని వెన్నుపూసవెంట చల్లగా దిగ జారి, యిసుకతిన్నెలలో అంతర్వాహిని అయిపోయింది." "నీరు పల్లాన కేగు" అనుటచే నీదృష్టివాహిని వెన్నుపూసవాలు నంటి క్రిందికి దిగజారి, గోదావరీవాహిని పాపికొండలఁ జీల్చు కొని, క్రిందికిఁ బోయి, సంద్రానఁ జేరునటుల ఇసుకతిన్నెలఁ

జెదరఁగొట్టి యేశృంగార సాగరముననో లయము కావలయును గాని వెన్నుపూసవెంబడిని పిఱుఁదులదరి కేగి, క్రిందికిఁ బోనేరక, రెండుపాయలై, ప్రక్కలకుఁ దిరిగి, యున్నతము లగు నిసుక తిన్నెలలో లీన మగుట యెట్లు పొసఁగును ?

కవిగారు వేగిరపడి, చూపుకాలువను ఇసుకదిబ్బలలో నింకింపఁజేసిరి. కాని యిది ప్రకృతివిరుద్ధకార్య మని గమనింపఁ జాలరైరి. అాతిగుట్టలనుగూడ గెంటుకొనిపోఁజాలు ఏటిజాలు బొండిసుకతిన్నెలఁ గూలఁద్రోయుట కాటంక ముండునా ? వీరీ దృష్టివాహినీప్రవాహమును ఒకవేళఁ గావ్యకళాదృష్టితోఁ జిత్రించి రేమో ? ఇపుడు నవ్యసాహిత్యకవులకుఁ బుష్టిదాయకముగాఁ గావ్యకలాదృష్టి యొకటి మొల కెత్తినది. ఈదృష్టితో సృష్టింపఁబడిన దృష్టివాహినీసంచారములకును ప్రాచీనకవుల చూపుకాలువనడకలకును భేదము విదిత మగుటకు నొకశ్లోకము నుదహరింతును.

శ్రీహర్షసార్వభౌముఁడు రత్నావళీనాటికలో నాయకునిదృష్టి నాయికయొక్క యూరువులుమొద లురోజముల వఱకు ఎట్లు క్రమముగా నడచెనో వర్ణించియున్నాఁడు.

శ్లో॥ కృచ్ఛ్రా దూరుయుగం వ్యతీత్య సుచిరం భ్రాంత్వా నితంబస్థలే
మధ్యే స్యా త్త్రివళీతరంగవిషమే నిష్పందతా మాగతా
మద్దృష్టి స్తృషితేవ సంప్రతి శనై రారుహ్య తుంగౌ స్తనౌ
సాకాంక్షం ముహు రీక్షతే జలలవప్రస్యందినీ లోచనే॥

అనఁగా నాచూపు ఊరుప్రయాసముతో నూరువుల దాఁటి, నితంబతటమునఁ గొంత విహరించి, త్రివళీతరంగములచే నిమ్నోన్నతముగా నున్ననడుమునఁ దొట్రుపడక, ఉత్తుంగము లగు నురోజములపై కెక్కి, దప్పిగొన్నదివలె జలబిందులవముల జాఱవిడుచుచున్న నయనముల నత్యాసక్తితో నిరీక్షించుచున్న దని భావము.

ఈరత్నావళీనాటికలోని నాయకదృష్టిసరణికిని ఆచార్యకీఔరత్ గ్రంథరాజములోని నాయకునిదృష్టివాహినికిని నడకలోఁ గొంచెము వ్యత్యాస మున్నది. మొదటివాహిని దిగంబర యగునాయికయొక్క పృష్ఠభాగమున నెట్టియడ్డంకులు లేక, కడపరాతిపలకవలె నున్నగానున్న వెన్నుపైని మెడమొదలు తుంట్లవఱకు నతివేగముగాఁ బరుఁగిడినది. రెండవదృష్టి వస్త్రాలంకృత యగు నాయికయొక్క ముఖభాగమున నూరునితంబాదులు ఆటంకము లగుటచే నెమ్మదిగ నడువఁగలిగినది.

సరసు లీకావ్యద్వయమునందును, పృష్ఠదృష్టి సొంపుగా నున్నదో! లేక ముఖదృష్టి యింపుగా నున్నదో! నిరూపింతురు గావుత. అంతియ కాదు. ఆచార్యకీఔరత్ అనునామకరణము ముద్దుగా నున్నదో, రత్నావళి యనుపేరు మనోహరముగా నున్నదియో వివరింపవలయును. నవ్యకవు లిప్పుడు ఏలయో! పూర్వులవలె జానకీపరిణయము, శాకుంతలము, మాలతీమాధవము లోనగు గ్రంథనామములఁ బరిత్యజించి కాలేజీగరల్,

ఓన్లీడాటర్, రంగూన్‌రౌడి, పోరంబోక్ లోనగు జానుతెనుఁగు పేర్లను వాడుచున్నారు.

"యథా వాచాం తథా స్త్రీణాం సాధుత్వే దుర్జనో జనః" అని భవభూతిమహాశయుఁడు తెలిపినటుల, హితబోధకము లగుసత్కృతివచనములను, ధర్మనిరత లగుపరసతులను నిందలపాలు సేయుచున్నారు.

ఎంతసేపు వ్యభిచారవర్ణనములే ప్రకటితము లగుచున్నవి కాని శౌర్యౌదార్యాదిఘనగుణముల వర్ణించి, సోదరసంఘమును గీర్తివంతమునుగాఁ జేయఁజాలుకావ్య మొక్కటియుఁ జూపట్టకున్నది. మఱియు వితంతుసోదరీమణులఁ గామాంధలనుగాఁ జిత్రించుటలోఁ బాపమునకు వెఱవకున్నారు. కనుఁడొకకవిరాక్షసుఁ డెట్లు వ్రాసెనో? "ఒక బొమ్మలదుకాణందగ్గర ముండనముండితంబగు గుండులసమాజం గ్రూపుగా నిలబడివుంది. అందులో సమాక్రాంతయవ్వనసౌందర్యసంశోభితమైన అపూర్వ పూర్వసువాసిని ఒకర్తె నావైపు పదేపదిగా చూడట మారంభించింది. విగతకంచుకియగు నావిధవయొక్క పాలిండ్లప్రతిభలు ప్రక్కలకు బరుగులెత్తుతున్నాయి."

కంటిరా? ఈనవ్యసాహిత్యపండితులు ముండనముండిత లగుతల్లుల నెట్లు నీచముగాఁ జిత్రించుచున్నవారో! ఇట్టిగోత వ్రాఁత లమితముగాఁ గలవు.

ఓ వినతాసుతవాహనా! పాపదహనా! నీ వవతారము లెత్తిన భారతదేశ మెట్టిదుస్థితికి వచ్చుచున్నదియో కనవలదా?

పవిత్రాంధ్రసాహిత్యామృతభాండము కల్లుకుండగా మాఱుచున్నదే!

శ్లో॥ న యత్ర స్థేమానం దధు రతిభ్రాంతనయనా
గళద్దానోద్రేకభ్రమదళికదంబాః కరటినః॥
లుఠన్ ముక్తాభారే భవతి పరలోకం గతవతో
హరే రద్యద్వారే శివ శివ శివానాం కలకలః॥

అనునట్లు ఏపట్టున పండితవరు లగు నన్నయభట్టారకాది కవిఘనులు పావనానూనకవితావాహినులఁ బ్రవహింపఁజేసిరో! ఆగడ్డనే అవినీతికవితాకాపిశాయనప్రవాహములు వెల్లివిరియుచున్నవి!

ఇంచుమించుగా నిట్టి యవినీతిశృంగారవర్ణనములు గ్రాంథికసాహిత్యమునందుఁగూడఁ గలవే? అందుచే నీ వీనవ్యాసభ్యముల నేలయెత్తిచూపితి వందురా? ఇంతటియమంగళవిషయములందుఁ గానరావు. మఱియు, నవ్యసాహిత్యవాదులు పూర్వమార్గములఁ బరిత్యజించి, నూత్నపథమున సభ్యకావ్యముల సృష్టించుచున్నామని ప్రకటించుటచే నిట్లు వ్రాయవలసివచ్చినది. వీరును పూర్వులదారినే పోవువా రగుచో ఈయసభ్యముల వెల్లడించువాఁడను గాను. వీరు ప్రాచీనకవితలఁ ద్రోసిపుచ్చిరా? అని ప్రశ్నింతు రేమో! సందేహము లేదు. నన్నయాదికవివరులకవితల ద్రోసియున్నారు. కనుఁడు:

"అంతదాక యెందుకు నన్నయనాటి కంపు నేటి మనకు యింపు కాదు."

"వారు (నవ్యసాహిత్యము) అభ్యసించినవీ, అనుభవములలోనికి తెచ్చికోడానికి ప్రయత్నించేవీ, వైదేశికపు భాషలూ భావాలున్నూ" (పంచాగ్నులవారు—ప్రతిభ.)

"భాష శుద్ధశ్రోత్రియముగా నుండవలె నని, మడిగట్టుకొన్న పండితు లనుచున్నారు. ఎంత చక్కనిచుక్క యైనను నేండ్లు గడచినతరువాత అవ్వ యగునని యెఱుంగక యీపితామహులు వీధిని బడుచున్నారు."

(శ్రీ జో. సత్యనారాయణమూర్తి, ఎం. ఏ., బి. ఎల్. గారు—సాహిత్యతత్త్వవిమర్శనము.)

ఇది యొక మూడ్నెన్నుకాని మేధస్సు కాదు. ఏమందురా? భాష మర్త్యాంగన కాదు. త్రిదశాంగన. కావున భారతీమాత యువతిగానే యుండును గాని, మనహూణాచార్యులవారు తలంచినట్లు ముత్తవ్వ కానేరదు. సరస్వతిని దైవతమునుగా నార్యులు భావించుచున్నారు కాని, మన యెమ్మేగారు తలంచినట్లు నాయనమ్మనుగా భావించుటలేదు. వినుఁడు:

"యాకుందేందుతుషారహారధవళా"......లోనగు సరస్వతీప్రార్థనములు.

ఈపావనభావమును గ్రహింపనేరక మన కనిష్ఠభ్రాతలు పితామహుల గేలిసేయ దొరకించుకొన్నారు.

మఱియుఁ దాతలనాఁటి ప్రాఁతపుంత లన్ని సన్నగిలిన వనియు, ఆప్రాఁతలపై ములురుప్పలు పెరిఁగిన వనియు, వ్రాసియున్నారు.

"తొలినాటి సంద్రాలు, తుహినగిరి శిఖరాలు
ఇంకిపోతున్నాయిలే, క్రుంగిపోతున్నాయిలే."
"తాత వేసిన పుంత, దైవ మేలిన సంత
పల్లేరు ప్రాకిందిలే, జిల్లేడు మొలిచిందిలే." —(ప్రతిభ.)

ఈరీతిగా నెందఱో ఎన్నివిధములనో ప్రాచీనకావ్యమార్గముల నిందించుచున్నారు. గ్రంథవిస్తరభీతిచే వానిని విడిచితిని.

సంఘకళ్యాణమునకై నవ్యసాహిత్యరచనలఁ జేయుచుంటిమని, ప్రకటించి, అవినీతికవితల నల్లి, యువతీయువకులచిత్తముల మాలిన్యవంతములనుగాఁ జేయుచున్నారు. కావున వీనిదౌష్ట్యములను వెల్లడింపవలసివచ్చినది.

ప్రాఁతకైతలు మనకుఁ బనికిరా వనియు, నేఁటి క్రొత్తలే కావలయు ననియు నవ్యపండితులు తెలుపుచున్నారు. "గతమంతా గతము అది తెలియదు. మన కిప్పటిదే కావలయును. నవ్యసాహిత్యపరిషత్తు కోరేది అదే."

(శ్రీ గిడుగు రామమూర్తి పంతులుగారు—ప్రతిభ.)

ఇట్లు నిరుపమానపావనభావనాశోభితము లగు పురాతన కవితల నిస్సారము లని పరిహసించుచున్నారు. పరభార్యానగ్న సౌందర్యాసక్తులకు పతివ్రతాధర్మములు ప్రీతిజనకము లగునా? రావణునకు రామునిజీవితము నింద్యముగాఁ గన్పట్టుటలో వింత యే మున్నది? అర్జునకుఁ బ్రాజ్ఞహేలనమే సంతోషావహము. కనుఁడు తులసీదాసపద్యరత్నములు

చౌ॥ హంసహి బకదాదురచాతకహీ
హాసహి మలిన ఖలవిమల బత కహీ॥

అనఁగాఁ గొంగలు హంసలఁ బరిహాసించునట్లును, కప్పలు చాతకముల నిందించునట్లును, మలినహృదయులు విమలాశయుల గేలిసేయుదు రని భావము.

ఈయసభ్యభావకవులలో నొక్కరికిని సాహిత్యసారస్వతముయొక్క రీతి యెట్టిదో, దానిని విరచించుమార్గ మెద్దియో, ఆవంతయుఁ దెలియదు. మఱియుఁ దాము వాడుపదములు భావార్థకములో, కర్త్రర్థకములో, కర్మార్థకములో, యేకర్మ మెఱుంగరు. ఇదే మిట్లు ప్రయోగించుచున్నా రనిన, శబ్దార్థములతో మాకు నిమిత్తము లేదు. మాది భావసమాధి యందురు. వెనుక నొకశాబ్దికుఁడు తార్కికుని ఇదే మి ట్లపశబ్దము వాడితి వన "అస్మాకూణాం తార్కికేషాం అర్థర్యేవ తాత్పర్యం న శబ్దరి" అనినాఁడఁట. నేఁటినవ్యకవుల సమాధానమటులనే కానవచ్చుచున్నది.

వినుఁడు: శ్రీ జొన్నలగడ్డ సత్యనారాయణమూర్తి ఎం. ఏ., బి. యల్. గారినుడువులు. "సారస్వత మేమో, సారస్వతహృదయ మేమో, యెఱిఁగినవా రాంధ్రసీమయందు మిక్కిలి తక్కువగా నున్నారు. అని బిగ్గరగా పలుకుటకు నేను జంకను." వింటిరా ? ఎ. మ్మే. బి. య ల్గారి పలుకుటుఱుములు? వీరు సామాన్యులు కారు. సాహిత్యనికషోపలమేధావులు.

సాహిత్యనిర్మాణమునకు నవినీతివర్ణనమే భాగ్యముగా నెంచువారికి రామాయణాద్యుపాఖ్యానములయందలి నీతులు రుచించునా ?

"క స్త్వం లోహితలోచనాస్యచరణో హంసః కుతో మానసాత్
కిం తత్రాస్తి సువర్ణపంకజవనా న్యంభ స్సుధాసన్నిభమ్
త త్తీరం కిము రత్నఖండఖచితం కల్పద్రుమాలంకృతం
శంబూకాః కిముస న్తి నేతిచ బకై రాకర్ణ్యహీహీకృతమ్॥"

అని పండితరాజు తెలిపినట్లు, ఆ గ్రంథ మేమి ? రామాయణము. అం దేమి కలదు ? నిర్దుష్టము లగు శబ్దార్థములును, పావనము లగు భావములును. దానికి నాయకుఁ డెట్టివాఁడు ? పరకాంతల మాతలనుగా నెంచు నేకపత్నీవ్రతుఁడు. బూతు చేఁత లున్నవా ? లేవు. సరే నిస్సార మన్నమాట- అనురీతిని పురాణముల గేలిసేయుచున్నారు.

నే నెత్తిచూపినవి నవ్యకావ్యములయందలి యవినీతివిషయములే. కావున సహృదయు లగుకవులు తమప్రమాదముల సవరించుకొనఁ గోరెదను. ఈ క్రిందిబోధల గారవించుచో నాకోరికి తగిన దని తెలియనగును.

"ఈ విక్షేపశక్తులే మనను మేల్కొల్పి ప్రమాదములను సవరింపజేసికోవడమునకు సాధనములుగా వుపకరి స్తవి."

"కావ్యసాగరగర్భంలో అణగి మణగిన విశిష్టగుణదోషములను ఎత్తిచూపే విమర్శకుని కిరాతు డన్నంతకాలము కావ్య

ప్రణేతకు మోక్షం లేదు. అతని రసోపాసనకు సిద్ధి లేదు"(ప్రతిభ.) కావున సదాశయులు తమదోషముల నెత్తి ప్రత్యక్షము చేసినవాని పై నాదరము చూపుదురు కాని, ఆగ్రహమును వెల్లడింపరు.

మఱియు నే చూపిన అసభ్యవిషయములు ప్రాచీనరచనలయందును గన్పట్టుచున్న వని, వాదించువా రుండిన నుండవచ్చును గాని, యీయవి యసభ్యములు కా వని, సమర్థింపఁ జూచువా రుండ నేరరు. నవ్యకవిసోదరులలోఁ గొందరైనను తమయసభ్యపంథల విడిచి, సభ్యమార్గమునఁ గావ్యములు వ్రాయఁబూనుదు రేని నా యీప్రయాసము కొంత ఫలవంత మగును. అట్టిసామ్యస్వభావులు కన్పట్టకున్న నీయది యడవిఁ గాచినవెన్నెలయే యగును.

ఈ యసభ్యకావ్యనిర్మాత లింతటితో తృప్తిచెందుట లేదు. ఏకావ్యమందారకాండముపై నిలిచి, వాల్మీకికోకిలము వీణానాదములనడుమఁ బాపహారము లగు శ్రీరామచరితముల మనోహరముగా గాన మొనర్చెనో! ఏకృతిపారిజాతముపై వ్రాలి, వ్యాసశారికము రణమంధుభిధ్వానములనడుమ భగవద్గీతలఁ బాడెనో! ఏగ్రంథహరిచందనస్కంధముపైఁ జేరి, శుకయోగికీరము మనోమోహనవేణునాదములమధ్యను భక్తితత్త్వములఁ గీర్తించెనో! దేనినిపఠించుటచే ఆర్యసంతతి ఆనందాబ్ధి నోలలాడునో, ఏవి పాపహారములో, ఏయవి మంగళప్రదములో అట్టి రామాయణ, భారత, భాగవతములలోని ప్రధాననాయకుల

జీవితములఁ దీసికొని, వీ రెట్లు మలినము చేయుచున్నారు! మఱియు నవి యవినీతిపూరితము లనుచున్నారు!

ఒకకవిసోదరుఁడు జగత్పూత యగు సీతజీవితమును అశోక మహరూపకమున అసభ్యముగాఁ జిత్రించియున్నాఁడు. సీత వివాహమునకుఁ బూర్వము మిథిలోద్యానమున నుండఁగా రావణుఁ డటకు వచ్చును. అపుడు సీతచెలి, "అమ్మా లంకేశ్వరులు రా నపేక్షిస్తున్నారు" సీత "సరే రమ్మను" రావణుఁడు వచ్చినవెంటనే వాని నాదరించి, సీత యిట్లు ప్రశ్నించును. "లంకనుంచి యింతదూరము ప్రయాణం మహాప్రయాస." రావణుఁడు "కాదు కార్యసిద్ధికి ప్రయాస లేదు." సీత (చిరునవ్వుతో) "సాహసులు అందుచేత పాటింపలేదు." రావణుఁడు "అది కాదు వుత్సాహము, ఆతృతా వేగాన్ని అధిగమించి దూరాన్ని తొందరగా దగ్గరకు లాగినవి." సీత "ఎందుకూ అంత తొందర" సీత (నిట్టూరుస్తూ సఖితో) "మధు తీసుకురా" ఇంతటితో నీరంగమును ముగించి, వేఱొకరంగమును ప్రకటింతును.

అశోకవనమున నున్నసీతకడకు రావణుఁడు వచ్చును. అపుడు సీత యిట్లు ప్రసంగించును. "రా యిలా రా కూర్చో ఎందుకు అంత తొందర పడ్డావు. అంత తుఫానులా అయిపోయి ఎందుకు నన్ను తీసుకు వచ్చావు" (రావణుఁడు సీతను వెఱ్ఱిగా చూస్తూ నిట్టూరుస్తాడు) సీత "రావణా కోర్కె వీడి యీప్రణయ ప్రపంచంలోనికి రాకలవా యీశరీరం అంచులు దాటిన ప్రణ

యంలో రాముడా? రావణుడా? అనే ప్రశ్న వుంటుందా, రావణా కదులు యిది గ్రహించు" రావణుడు (గాఢంగా కన్నులు మూసుకొని) "సీతా మారుతూవుంది నాలోపలి సమస్తమూ, నామెదడు గ్రహించలేని పరివర్తనములో పడిపోతూ వుంది"..."రావణా యిటు చూడూ" రావణుడు "చూడలేను సీతా చూడలేను. నీ చూపుల స్పర్శల ఆకర్షణకు యీ శరీరాన్ని ఆపలేను" సీత (రావణుని చేతులు కళ్లనుంచి తీస్తుంది) రావణుడు "సీతా నీరావణుడు" (అని ఒరిగి పడిపోవును) సీత (శాంతంగా వాని శిరస్సు తన తొడమీద పెట్టుకుంటుంది. సీత కన్నులలోనుంచి రెండు అశ్రువులు రావణుని కన్నులలో పడతవి. సీత విశ్వమంత నిట్టూర్చి డగ్గుత్తికతో) "రావణా! (తెర గంభీరముగా పడును.)"

కంటిరా? సీతజీవిత మెంతయసభ్యముగాఁ జిత్రింపఁబడినదియో! పయినివ్రాయఁబడిన అశోకమున "అంచులు దాటిన ప్రణయంలో" అని యొకవాక్యరత్నము కానవచ్చెడిని. అంచులు దాఁటినప్రణయ మేమిటి? పరిపూర్ణముగఁ బెంపొందిన యని భావమా? ప్రాజ్ఞులీయంచుల మించినవలపును గాంచి ఏవగింపకుందురా? కంచుకాగడాలు వేసి వెతకినను ఈకవితలలో నౌచిత్య మావగింజంతయైనను గానరాదు.

ఇట్టిపాపంపుకైతల లోకమునకు నివేదింపవలసివచ్చి సందులకుఁ జింతించుచుంటిని. సీతారావణుల సంభాషణవర్ణ

నములు పాపభూయిష్ఠములే కాక, లోకజ్ఞానదూరములుగాఁగూడ నున్నవి. అవివాహిత లగు నుత్తమక్షత్రియకన్యలు అపరిచితు లగుజారపురుషులఁ జేరఁజీరి, మద్యముల నొసంగి, ఆదరించి, వారితో సంభాషించుట సంభవ మగునా ?

క్షత్రియకన్యలే కాదు. భారతభూమిలోఁ బుట్టిన కుల కన్య లెవ్వరు నిట్టిపాపకార్యములఁ జేయఁజాలరు. మఱియు వివాహిత లగు నార్యయువతులు పరమనీచునిశిరమును తమ తొడపై నిడుకొనుట సంభవ మగునా? ఇట్టిగర్హితకృత్యముల పూతజీవిత యగుసీత చేసినట్లు రూపకముల వ్రాయుట పాడి యగునా? ఇంతకంటె పాపమును, దేశద్రోహమును వేఱొండు కలదా ? ఆహా ! మునినుతచరితా ! సీతామాతా ! నిన్నవ మానింపఁజూచు నీచనిశాచరు లిప్పటికిని కల రని, విచారించు చుంటివా ? పాపము శమించుఁగావుత ! నిజముగా నీసమ యమున—— (జయంతి రామయ్య పంతులుగారి ఉత్తరరామచరితము.)

"చ. అలఘుతరార్కవంశకలశాబ్ధిశశాంకులు సర్వలోకపూ
జ్యులు నగుపార్థివుల్ తమవిశుద్ధచరిత్రముచేతఁ బండువె
న్నెలగతి లోక మెల్లెడల నింపినతోరపుఁగీర్తి కీయెడన్
గలుష మొకింత నావలనఁ గల్గినచో నిఁక నన్నుఁ గాల్పనే."

అని పరితపించిన వీరాధివీరుఁ డేకులమున నుద్భవించెనో అట్టిప్రభాకరవంశసంజాతు లగుకుమారవీరు లున్నచోఁ దలలు కందుకములవలె మీటుఁ దాండవింపకుందురా ?

ఈయశ్లోకమును వ్రాసినకవిశిఖామణి రూపకమున సీతను అవినీతిపాలు సేయుటయేకాక, తాను వ్రాసిన రావణప్రణయ ప్రశంసను సమర్థించుచు, రూపకాంతమున మూలముకు మించిన యొకబృహద్భాష్యమును వ్రాసి, అందు సీత పరపురుషునితలను తొడపై నిడుకొనుట తగునా ? అనుపూర్వపక్షమును జేసికొని, యిట్లు సిద్ధాంతీకరించెను.

“శరీరానికి సంబంధించినది స్పర్శ, హృదయానికి సంబంధించినది కామం” ఓహో! ఏమి యీసిద్ధాంత ప్రావీణ్యము. కామమున స్పర్శ లేదా ? స్పర్శకుఁ గారణము కామమే కదా ? మానినులు తాము కామింపనివానిని స్పృశింతురా ? దర్శన స్పర్శనాదులు కామవిలాసములు. అందుచే పైనిఁదెల్పిన నిర్వచనములు అసంగతములు. “దర్శనస్పర్శనాదీని నిషేవేత విలాసినా యత్రానురక్తా వన్యోన్యం” అని తెలుపఁబడినది.

మొదట నొకవివేకదూర మగువిషయమును చిత్రించి, పిమ్మట దాని సమర్థింప అసంగతము లగుసిద్ధాంతములు వ్రాయుట నేఁటి నవ్యసాహిత్యపండితులకు పంథ యయినది. సీతనుగూర్చి యిట్టిపాపంపుకవితల నల్లునపుడు మషీపూరితములగు కలము లచేతనము లైన నగుఁగాక- కవులు జీవకళాశోభితు లగు భారతపుత్త్రు లని గుర్తెఱింగియుండవలదా ? ఇట్టి పాతకకవితల నల్లి కన్నులు పోఁగొట్టికొనఁ దలంచిరో ? కాలుని నగరున కేగ నెంచిరో ? సీతామహాదేవినిగూర్చి కాళిదాస

కవిచంద్రుఁడును, భవభూతికవిచంద్రుడును, ఎట్లు వ్రాసిరో నవధరింపుఁడు.

"లంకేశ్వరప్రణతిభంగదృఢవ్రతం త ద్వంద్యం యుగం చరణయో ర్జనకాత్మజాయాః" (రఘువంశము.)

"జనకతనయా స్నానపుణ్యోదకేషు" (మేఘసందేశము.)

"ఉత్పత్తిపరిపూతాయాః కిమస్యాః పావనాంతరైః"

"అగ్నిరితి వత్సాం ప్రతి పరిలఘూన్యక్షరాణి సీతేత్యేవ పర్యాప్తం" "శిశుత్వం స్త్రైణం వా భవతు నను వంద్యాసి జగతాం" (ఉత్తరరామచరితము.)

అనఁగా లంకాధిపతి యగు రావణుని నమస్కారములఁ దిరస్కరించుటలో దృఢవ్రతమును పూనినట్టియు, లోకవంద్యము లగునట్టియు సీతాపాదయుగళమును అనియు, సీతాస్నానములచే పావనము లైననీరములు గల అనియు, జన్మచేతనే పావనురా లగుసీతకు నితరపావనకార్యములతోఁ బ్రయోజన మేమి? అనియు, సీత నగ్ని పూతనుగాఁ జేసె ననుట వేలవపుమాట. సీత అనుపదమే లోకపావన మైనది అనియు, శిశుత్వ- స్త్రీత్వములు దూరముగా నుండనిమ్ము. నీవు లోకవంద్యవు అనియు భావము.

లోకవంద్యుఁ డగు వివేకానందయతిచంద్రుఁడు సీతను గూర్చి యేమి వ్రాసెనో కన్నులకఱవుదీఱ నీక్షింపుఁడు.

"She the ever chaste and ever pure wife, She the ideal of the people, the ideal of the Gods, the great Sita, our national God she must always remain"

"Ramas there may be several but Seethas can never be."

అనఁగా సీత సకలసుగుణమణిఖని యనియు, పాతివ్రత్య తేజమునకుఁ బరమావధి యనియు, రాము లనేకు లుండవచ్చును కాని సీతమాత్ర మొక్కతియె కాని బహుసీత లుండుటకు వీలు లే దనియు, అనఁగా సీతకు సీతయే సాటి యనియు భావము.

గృహలక్ష్మిపత్రిక యేమివ్రాసెనో చూడుఁడు.

"భారతస్త్రీకి స్వార్థత్యాగము సేవ యనునవి యాదర్శ ములు. ఈయాదర్శములు సీతయందు నిండి నిబిడీకృతములై యున్నవి." ఇ గ్లెండఖో ప్రాజ్ఞులు సీతాజీవితమును ఘనముగాఁ బ్రశంసించియున్నారు. ఈనవ్యసాహిత్యకవులు సీతజీవితమును మాత్రమే మలినము చేసియుండలేదు! ఆకలముతోనే మఱి కొంద ఱుత్తమకులజలచరితముల నీచముగా వర్ణించియున్నారు.

తన్నుఁ బరిగ్రహింప వచ్చినత్రిదశులనుగూడ విడనాడి, నిష్కలంకానురాగముతో నరుఁ డగునలునిఁ బడయఁగోరిన సతీ మణియగు దమయంతినిగూర్చి యెట్లు హీనభావమును వెల్లడిం చిరో! చూడుఁడు;

నలుఁడు దమయంతిని అడవిని విడనాడి, వెడలిపోయిన పిదప నాసాధ్వి యాడవినలుగడలఁ గలయఁదిరిగి, ప్రియునిఁ గానక తుదకుఁ గుండినపురము చేరును. “కొన్నాళ్ల కా ఊరు వితంతువివాహాపు ఏజంటు వచ్చి, దమయంతిని మళ్లీ వివాహం చేసికొనుమని ప్రోత్సహించాడు. బీదవాడైనా బుద్ధిమంతుడైన కుర్రాణ్ని వరుడుగా చూపేటప్పటికి దమయంతికే సరదా పుట్టింది.”

ఇఁక నలునిగూర్చి “దమయంతి ద్వితీయవివాహ మనే టప్పటికి అతనికి అతిసంతోష మైంది. ఎందుకంటే ఆ యింట్లో దాసీపైని మోహం పుట్టింది.” పిమ్మట దమయంతి ద్వితీయ స్వయంవరములో ఆబీదకుఱ్ఱవానిమెడలో సుమదామము వేయును. నలుఁడు లేచి, నేను మొదటిమగఁడను అని కేక లిడును... ...

హరహరా! ఎవ్వరినామకీర్తనముచేఁ గలిదోషము నాశన మగు నని మనపెద్దలు తెలిపిరో! అట్టి నలదమయంతులఁ గూర్చియా! యిట్టి పాపపువ్రాఁతలు?

ఇది పరిహాసమునకు వ్రాసినది కాని యథార్థమును బోధించుటకుఁ గా దందురా? పరిహసింపఁ దగుగాథ లెవ్వియో, పూజింపఁ దగుచరితము లెట్టివియో యోజింప వలదా? పరిహాసమున కని తల్లికి కాముకేఖల వ్రాయ నగునా? ఎగతాళి కని తండ్రికిఁ బంగనామముల దిద్ద నగునా?

ఈకవికి దేవత లున్నారను నమ్మిక లేకపోవుటచే నింద్రాది దేవతలఁ బాఱఁదోలి, నలుగురు తెల్లదొరలను స్వయంవరాన దింపెను. "మైదానంలో యేరోప్లేనులోనుంచి నలుగురు తెల్ల దొరలు దిగారు" ఇఁక నొకవింతవ్రాఁత: "మూడేండ్లు గడిచాయి, ఏడాది కొకరుచొప్పున యిద్దరిపిల్లిల్ని కన్నది." మూఁడేండ్లు గడచిన యేఁడాది కొకపిల్లవంతున ముగ్గురుబిడ్డలు పుట్టవల యును కాని యిద్దఱు పుట్టుట యేమిటి? పంచపాండవుల నే నెఱుఁగనా మంచంకోళ్లలాగ ముగ్గురు అన్నాఁడఁట ఒకాయన. దానికిని దీనికిని సోదరభావము గన్పట్టుచున్నది.

ఆర్యకుమారికలచే దైవతభావముతోఁ బూజింపఁబడు చున్న సావిత్రియొక్క జీవితము ఒకనవ్యరూపకమున అతిమలి నముగా వ్రాయఁబడినది. సావిత్రి మృతుఁడైనపతిని బ్రతికింపు మని, యముని వేఁడ ఆధర్మరాజు "నాతో నీ వొకరాత్రి కల సితివా నీనాథుని జీవింపజేతును" అని తెలుపును. సావిత్రి పతి జీవితమే ప్రధానముగా నెంచుకొని అందు కంగీకరించును. కాని తుదకు పాపపుసాంగత్యము సాగలేదు. ఈరీతిగనే పావనచరిత లగు పురాణమాతలజీవితములు మలీమసములుగాఁ జిత్రింపఁ బడుచున్నవి. నవకవులచే నీచాశయముగా వర్ణింపఁబడిన దమయం తినిగూర్చి ఒక ఆంగ్లేయవిద్వాంసుఁ డేమివ్రాసెనో చూడుఁడు.

"It is one of the least corrupted of the episodes......the poem is pervaded by a high tone of morality, manifestd above all in the

heroic devotion and fedelity of Damayanti its leading character"

Macdonell—Sanskrit literature.

శ్రీ వివేకానందసంయమీంద్రుఁ డేమిబోధించెనో వినుఁడు:

"హే భారతీయా! నీనారీజాతి ఆదర్శము సీతా, సావిత్రీ, దమయంతు లనుటను మఱవకుము" ఈరీతిగా సోదరాభ్యుదయమును గోరువిద్వాంసు లెల్లరును సావిత్రి, దమయంతి, సీత లోనగుసతీమతల్లులజీవితములే దేశకళ్యాణమునకు మూలాధారము లని ప్రస్తుతించియుండ, ఈనవ్యకవులు వానినే లోకమంగళమునకు భంజకములనుగా వర్ణించుచున్నారు! ఈకవు లెవ్వరు? విజాతివారా? కారు- కారు- స్వజాతిసోదరులు. ఇట్టివ్రాతల నాధారముగాఁ దీసికొనియే సౌభాగ్యవతి యగు మేయోకన్య హిందూసంఘము అవినీతిభాజన మని, గ్రంథములు వ్రాసినది. కావున కవిసోదరులు తమకావ్యములు దేశమున కెట్టియిక్కట్టును తెచ్చిపెట్టఁగలవో కనిపెట్టవలయును కాని, కలమున సిరా యున్నదికదా యని, పత్రములు నలుపు సేయరాదు.

## —♦ ప్రణయోక్తులు ♦—

ఈనవ్యకావ్యకవికోకిలతిలకులు పలికిన ప్రణయమంజులాలాపములఁ దిలకింపుఁడు. "నీ యీ శిథిలవార్ధక్యంతో నా

యవ్వనాన్ని యెందుకు కట్టేవు? యీ ముఖంవైపు కన్నెత్తి చూడు. ఈ క్రొత్తయవ్వనం ఈ వుప్పొంగుతూవున్న రూపం ఈయసంతృప్తికరమైన ఇచ్ఛా, వుత్సాహంతో నిండిన యీ హృదయం చూస్తున్నావా. కోమలంగా పూచిన క్రొత్తలతని యీ నీరసమై, యెండి, ఆకులులేని కొమ్మకి ఎందుకు కట్టేవు" ఇవి తన్ను పరిగ్రహించిన గౌతమమహర్షినిగూర్చి అహల్య పలికిన మంజులపదనాదములు. "ఎక్కడికి పోతున్నావూ, ప్రియుడా యిప్పటివరకు నేను యువతిని నీవు పది సంవత్సరాల వరకు యీరూపముయొక్క మధిరాన్ని త్రాగావు. కాని పాత్రను చూడు. యింకా మిగిలి వుంది. ఇపు డింకా యిస్తాను. కన్నెత్తి యీ దట్టమయిన, నల్లకేశాల్ని చూడు. యీ తెల్లని దంతాల్ని చూడు. ఈ అందమైన దేహలతని చూడు. ఎర్రని రంగులుగల పెదవిల్ని చూడు. యీ పుష్టిగల వున్నతమైన వక్షాన్ని చూడు. ఎంత రూపమధిరం కావాలో అంతా యిస్తాను. ఎంత కావాలో త్రాగు కాని పోవద్దు." ఈయవి ఇంద్రునిగూర్చి అహల్య పలికిన ప్రణయోక్తులు. శివశివా! యివియా? తేట తెనుంగు తేనె పల్కులు! ఇవియా? ప్రణయమంజులాలాపములు! ఔరా! బాసయొక్క వన్నెకును భావముయొక్క యెన్నికకును, ఎంతటి చేటు వాటిల్లుచున్నది!

ఇటం గవి చిత్రించిన ప్రణయోక్తులశైలిని బట్టిచూడ కావలసినంత అసభ్యత గోచరించుచున్నది. కనుండు: "పాత్రని చూడు కన్నెత్తి యీదట్టమయిన నల్లకేశాల్ని చూడు."

పాత్రకడ నల్లకేశాల్ని దట్టముగాఁ జిత్రించుట అశ్లీలార్థస్ఫోర కము కాదా? కవియభిరుచినిబట్టిచూడ నీనల్లకేశాల్ని తల కెగఁ ద్రోయుటకు వీలు కాదు. ఈయువయువవర్ణనము క్రిందినుండి పై కెగఁబ్రాఁకి యున్నది. అందుచే వీనిని గ్రమాలంకారములుగఁ బాత్రదగ్గఱనే యుంపవలయును.

లలితము లగు ప్రణయాలాపములు చిలుకపలుకులవలెఁ జిన్నవిగను, పటికిబెల్లపుముక్కలవలెఁ దియ్యగను ఉండవల యును గాని రాసభరావములవలె దీర్ఘముగను, వేపబెరడులట్లు వెగటుగను ఉండరాదు.

"కిమపి కిమపి మందం మందమాసత్తి యోగా దవిరళిత కపోలం జల్పతో రక్రమేణ" అని భవభూతి ప్రణయవాక్యల వర్ణించియున్నాఁడు. కావునఁ బ్రణయగీతములు మనోహర మగు సన్ననినాదముతో రంజితములై యుండవలయును. పై యహల్యపలుకులవలె మోటుగా నుండరాదు.

రాక్షసకామిని యగుశూర్పనఖగూడ ప్రణయప్రసంగ మును లలితముగ సాగించినది కాని ఈయహల్యవలె మొటి కుగాఁ బ్రకటింప లేదు.

"చక్కనివారిలో మిగులఁ జక్కనివాఁడవు నన్నుఁ బోలుమేల్
చక్కని కాంతఁ గూడి బలుచందములన్ సుఖియించు టంతె గా
కిక్కుటిలాంగితోడిచను వేటికి దీనిఁ బరిత్యజింపు మో
చక్కెరవింటిసామి నెకసక్కెము లాడెదు రాజమన్మథా !"
(గోపీనాథరామాయణము.)

వేఱొకకవిపుంగవుఁడు "నా చన్నులు, నా వెంట్రుకలు, నాముఖం, నా పెదవీ, నీవే అని బాసచేసి, ఆమాట తీర్చక పోవడం మంచిదేనా ?" ఈఘట్టమునందలి నాయిక తనప్రియునకు స్తనముఖోష్ఠముల నిచ్చినట్లు బాస చేసినదన్న సరసముగా నుండును కాని వెంట్రుకల సమర్పించుట సభ్య మగునా ?

ఇఁక నొకకవివరుఁడు "ముక్కుదగ్గరనుంచి చెంపల మీద పొడుగ్గా కణతలవరకు పరుచుకొని వున్న కనువెంట్రుకలని చేత్తో తాకి చెంపమీద మెల్లగా కొట్టాను." అని వర్ణించినాఁడు. "దీనిభావ మేమి తిరుమలేశ" అనునట్లు కనువెంట్రుకలేమిటి ! ముక్కుదగ్గరనుంచి కణతలవరకు పఱచుకొనివుండడ మేమిటి ?

వీ రొకవైపున మాది తేటతెనుఁగుతేనెబాస యనియు, జానుతెనుఁగు అనియు మురియుచున్నారు కదా ? ఇట్టిపదసంపదను సమకూర్చుకొనియేనా అంత యుబ్బుట ? సంస్కృతము యొక్క దాస్యమునుండి విముక్తి నొందితి మని, ఆనందసాగర వీచికలపై నాట్యమాడుట! వినుటకుఁ గటువులై, అర్థావిష్కరణమున వెగటులై, భావప్రకటనమున మోటు లైనమాటలను సరసము లగుసాహిత్యరచనల కంటఁగట్టుచున్నారు. పైఁగా నేదియో యపూర్వసౌభాగ్యమును భాషకును, భావమునకును గొనివచ్చితి మని, ప్రగల్భములఁ గొట్టుచున్నారు.

## నవ్యకథాకల్పనములు

ఇఁక వీరి పురాణేతివృత్తరచనల విడిచి, స్వకపోలకల్పితము లగుకతలఁ దిలకింపుఁడు. వీనియందు నాయికలు రెండు వంతులు వితంతువు లగు నాఁడువాండ్రు; ఒకవంతు మగల విడిచిన పేరంటాండ్రు; నాల్గవవంతు అవివాహిత లగు పూఁబోండ్లు. వీరందఱికిని సామాన్యముగాఁ బ్రణయావిర్భావరంగములు పెద్దపెద్ద కళాశాలలు. ఒకనవ్యకవివరేణ్యుఁడు "విధవానురాగం" అనే తలవ్రాఁత క్రింద ఇట్లు చిత్రించియున్నాఁడు.

"తెల్లటి ఎడంచేతికి బంగారం గడియారం, ముఖాన్ని చిన్న కుంకంబొట్టు, తామరపద్మాల్లాంటి అందమయిన కళ్లు, గులాబిపుష్పదళాలకంటె కూడా మెత్తని పల్చటి అధరాలు, విద్యుచ్ఛక్తివిధంగా మెరుస్తున్న దంతాలు, కుంకుమవన్నెను కూడా ధిక్కరించే కపోలాలూ, వుంగరాలజుట్టూ, ఇవన్ని ఎవణ్ని ఆకర్షించవు నేనైతే కాలేజీ విద్యార్థిని. ఆమె నావైపు చూచింది. సిగ్గువల్ల తల క్రిందికి వంచేసుకుంది. నేనుకూడా కొంచెం సిగ్గు పడ్డాను."

చూచితిరా? యీకాలేజీవిద్యార్థినాయకుని జాను తెనుంగుసోయగము! ఎంతముద్దులొల్కుచున్నదో కంటిరా? ఈనుడికారము లెంత యింపుగనున్నవో!

మఱియొక నూతనకవిమత్తేభుఁడు వితంతు ప్రియునిచే నిట్లు పల్కించియున్నాఁడు. సందర్భ మేమన, కళాశాలవిద్యార్థి

డొకఁడు కళాశాలలోని వితంతుసుందరిని ప్రేమించి, ఒకనాఁడామె యింటి పెరటిగోడపై నెక్కెను. దొడ్డిలో "చెట్టుక్రిందనే చిన్న బట్టతో వున్న శాంత తడిబట్టలు కొమ్మకు ఆరవేస్తోంది." అకస్మాత్తుగా "అమ్మదొంగ అంతపనే చెప్పకుండా" నవ్వు ఆపుకోలేకపోతూ అన్నది. ఆకళ్లు ఎంత అమాయకత్వాన్ని చూపిస్తున్నవి! పైట సర్దుకుంటూ నిలువబడ్డది దొడ్లోకి ఎవరైనా వస్తున్నారేమో అని. అటు ఇటు చూసింది నా చేతుల్లో కరివేపాకు కోసి పడవేసింది. నా బుగ్గమీద తన చిన్నచేత్తో ఒక చిటిక మృదువుగా వేసింది. తన్మయత్వం వచ్చింది నాకు.

ఇట దొడ్డిలో చిన్నబట్టలు కట్టికొని, పనిచేసికొనుచున్న యువతిని గోడ నెక్కి చూచుటమాత్రమే వర్ణింపఁబడినది. ఇఁక వేఱొకకవిరాజు చిత్రించిన యసహ్యారంగమును గనుఁడు:

"ఆ పోకసింగులో తళతళలాడుతూన్న అవయవాల్తో బుర్ర వంచుకొని బహిర్భూమికి కూచున్న వో చక్కనమ్మాయగుపడింది."

కంటిరా? నవ్యకావ్యరచనల! ఇవియా! జాను తెలుంగుకావ్యములు? ఈనీతుల నాధారములుగాఁ జేకొనియేనా! భారతాదులయందలి నీతులు పనికిరా వనుట? ఒక కవి "నన్నయనాటి కంపు నేటి మన కింపు కాదు." అని తెలిపినాఁడు. నిజమే. నాయిక బహిర్భూమికి కూర్చున్నప్పుడు బయలువెడలుపరిమళము నాఘ్రాణించుకవివరాహునకు నన్నయకంపెట్లింపుగొలుపును?

పై మరుగుదొడ్డిరంగములు కావ్యముల సింగారించిన కవిరాజు బహుశః కాలకృత్యములఁ దీర్చికొనుచున్న సోదరీ మణుల దొంగతనముగాఁ దొంగిచూచు ననుభవరసికుఁడై యుండును. లేకున్న, "తళతళలాడుచున్న అవయవాల్తో" అన్ని, ఆసమయమునఁ దళతళలాడు అవయవముల వర్ణింపఁజాలఁడు.

ఇట్టుల నవ్యసాహిత్యనిర్మాతలు నాయికల గోడ లెక్కించియు, మరుగుదొడ్లలోనికిఁ దోలియు, గిటికీలకడ నిలువఁబెట్టియు, యువతుల గోప్యావయవముల సందర్శింపఁజేయుచున్నారు.

ఆహా ! నన్నయను దిట్టువాఁడొకఁడు. తిక్కనను వెక్కిరించువాఁ డొకఁడు. పోతన చేతకానివాఁ డనువాఁ డొకఁడు. మారన మాటఁడనువాఁ డొకఁడు. పెద్దనను దిద్దఁబోవువాఁ డొకఁడు. సూరనను గవి యన వీలుకా దనువాఁ డొకఁడు. ఇఁక వీరి పాండిత్య మన్ననో సంస్కృతమున శబ్దమంజరిని కాని, తెలుఁగున విభక్తిచంద్రికనుగాని కని విని యెఱుంగదు. మూఁడు నాలు లనుకరణకవులే కాని అనుభవకవి యొకఁడును గానరాఁడు.

ఈయసభ్యశృంగారసంగరరంగములు ముఖ్యముగా మెడ్రాసుబీచ్చు కాలేజీహాస్టల్లు. ఒక మహాత్ముఁడు ప్రణయ మావిర్భావమైనపిదప దానియుబుకు నాఁప శక్యముకాదని తెలుపుటకు, యువతీయువకులు ప్రణయప్రకోపముచేఁ గలాశాలా భవనముననే కార్యము నుపక్రమించి రనియు, ప్రిన్సిపాలాశృంగారకలను గాంచినను ప్రారబ్ధార్థము నుజ్జగింపలే దని

యును, సహజప్రణయము నడ్డ భగవంతునకుఁగూడ సాధ్యపడ దనియును, భావమును వెల్లడించియున్నాఁడు.

ఇట్టి వ్రాఁతలు కళాశాలావిద్యార్థులకును, దాని పరిపాల కులకును ఎంతటి తలవంపులు కలిగించునో యోజింపకున్నారు. సామాన్యముగాఁ గళాశాలలలోని యువతీయువకులు మోహ పరవశులై యుందురేకాని, విద్య నభ్యసించుటయందు కన్ను కలిగియుండ రని, వ్రాయుచున్నారు. కనుఁడు:

"లలితా నిన్ను ఒదిలి వెళ్లినా రోజల్లా నువ్వే తలపుకు వస్తావు. స్కూలులో వున్నా తటాలున నీరూపం జ్ఞాపకం వచ్చి పిచ్చెక్కుతుంది నీముఖం పోలిక పుస్తకంలో గీస్తోవుంటే మా లెక్చరర్ చూశాడు. నాహృదయాన్ని లాగేసి యీచెరుగులో దాచేసుకున్నావు నీహృదయానికి దగ్గరగా"—(పాపం)

ఈనవ్యప్రణయవర్ణనములలోఁ జూపట్టు క్రొత్తవింత ఏమన, పుంవ్యక్తికి స్త్రీశక్తి కంటఁబడినవెంటనే మెఱుపు తళుక్కు మన్నట్లు ప్రణయజ్వాల భగ్గు మనును. ఆపయిని వారికి అద్వైతసిద్ధియే. ఇట్టి ప్రణయావిర్భావము సాధ్యమా? ప్రణయ మంతటి పేలవతూలలవసదృశమా? కవి తనమనసున నున్న యుబలాటమును పాత్రపై నారోపించి, వ్రాసెనే కాని ప్రణయ మేలన మట్లవ్యవధిగా సమకూరియుండదు.

సరస మగు ప్రణయము సఫల మగుటకుఁ గొంచె మెడ ముండుటయే సొగసు కాని, మెఱుపు కనుపించినతోడనే ఉఱుము వినుపించునట్లు కామిని కంటఁబడినతోడనే ప్రణయము పొంగు

చుండుట స్వాభావికము కాదు. కాని నవ్యకవులు ప్రణయా విర్భావమునకు ఒకసెకండుకూడ మధ్య వ్యవధి యుండ దనియు, సేఫ్టీమాచిలకిడీలాగు అంటినవెంటనే భగ్గు మను ననియు వ్రాయు చున్నారు.

ఇంతటితో నీగద్యవాఙ్మయమును ముగించి, కొంచెము నవ్యపద్యరచనల నుదహరింతును.

"నాటినుండియు నేను ప్రతినిశీథమంపు
గాటుకల చాటు నోరు లేరరయలేని తరి
చూచికొని చూచికొని శూన్యహృదయములోని
'కో చెలీ !' యని క్రుంగి క్రుంగి యేడ్తును సుమా !"

"సడిలేని నడిరేయి బడిపోయిన నీ
కడియాల రవళులే చిరిగాజు మ్రోతలే
వ్రేలెత్తి చూపు జీవితపథమ్ములు నాకు;
కేలెత్తి నడిపించు, నెగ్గెత్తి నన్బిలచు."

"అపుడు నిల్చితి నోయి! నాప్రియు
రాలి శాంతమనోజ్ఞరూపము
తనివి దీరగ జూచు తలపున
స్తంభసవిధమునన్."

"నీవె నిట్టూర్పు నీవె కన్నీరు, విశ్వ
వేదనామూల్యభాగ్యమవె, నిజమ్ము
నే గళమ్మార పాడుకొనిన యఖాత
శోకగీతమ్ము లందీవె శోకగీతివి ?"

"చెక్కుచెదరని పాపిట చిక్కువడియె
వేణిబంధము శిథిలమై పిరుదులంటె
కరగి చెరగిన తిలకరేఖలను దుడుచ
వతివ యెవ డాహరించె నీయార్ద్రహృదిని."
"మూఢవిశ్వాసశృంఖలమ్ముల విదల్చి
వలపుకౌగిటముడి బట్టువడితి మేని
మన శరీరసుఖస్పర్శనమునకు నేటి
యణువణువుగూడ నవజీవన మనుభవించు."
"అట్టి నను నీవు మోహపాశాలవలన
పొర్లు కెరటాల నురుగు కేశాలవలన
సొగసువలన ఆకర్షించి శాశింతువు."
"పిల్ల నీపైట, చల్లంగ యిసురోలె
ఆ, గాలి నాకాలి కట్టె బగ బగ మండు."
"జమ్ముమంటాతోట సీకసైపోవాలి
సీకట్లో సూడాలి సీకళ్ల తళతళలు."
"తన్మయంబై మామకాక్షి
ద్వయము బంగరుబొమ్మ తొడిగిన
పట్టురైకను విడువదాయెచు
ప్రాణమిత్రంబా..."
"ఒంటిగ నేను సెజ్జపయి నొద్దిక నిద్దుర మున్గియుండగా
నొంటను గల్గువస్త్రముల నొక్కట నూడ్చి విలాసలీల గే

లంటుచు లేపి నే మిగుల నాత్రముతోడను ద్రొక్కులాడగా
బంటుతనంబునన్ గదిసి పక్కన నవ్వును జెప్ప సిగ్గగున్."

"ఆకులలోన నాకునయి, యచ్చపుదేనియలోన తేనెనై
కేకులలోన కేకినయి కేరుచు గీతిక లాలపించు నీ
యాకలలోన యాకనయి యెట్టులొ నుస్మదవృత్తి నేడ్చుచున్
నీకయి నిల్వ నీడయిన నేరను నా ప్రణయంబు విశ్వమే."

"ఆరిపేయవే దీపమూ
ఎలుగులో నీమీద నిలుపలేనే మనసు
ఆరిపేయవే దీపము."

కంటిరా? ప్రణయగీతికాగానమును! భాగవతమున గోపికలు పాడినగీతికలు నీతిదూరములంట! అట్టిగీతికల సృష్టించినకవులు రసజ్ఞులు కారంట! కనుక నవ్యకవులు మంజుల మార్గమున ఈ ప్రణయగీతికల గానము సేయవలసివచ్చినదంట! ఆహా! కాల మెట్లు మాఱుచున్నది!

నిజముగా సంసారులు నిజకాంతలు దూరదేశమున నున్నపుడును, పరలోకమున కేగినపుడును వారికిఁ దా మొసంగినప్రేమభాగ్యమును పరకామినులపరము సేయక, నిజహృదయ పేటికలయందే భద్రముగా నుంచి, స్వభార్యలఁ దలంచి, పరితపించుటయే పావనానురాగలక్షణము. వాల్మీకిమునీంద్రుఁడు కరుణవిప్రలంభమును, కాళిదాసకవిచంద్రుఁడు మరణవియోగమును మనోహరముగాఁ జిత్రించియున్నారు. ఇట్టి స్వసతీ

వియోగపరితాపములు సభ్యములు ఇఁక పరభార్యలకై పలవరింతలు అసభ్యములు ఈరీతివర్ణనములు జాతికిఁ గళంకములగును కాని యలంకారములు కాఁజాలవు.

దుర్గుణవర్ణనము కావ్యమును మలినము సేయును కాని కాంతికలితమునుగాఁ జేయఁజాలదు.

"తదల్ప మపి నోపేక్ష్యం కావ్యే దుష్టం కథం చన
స్యా ద్వపుః సుందర మపి శ్విత్రే ణైకేన దుర్భగమ్"

అని తెలుపఁబడినది. కావునఁ గవులు పరభార్యల మాన్యలఁగాఁ జిత్రింపవలయును కాని జారకాంతలనుగా వర్ణింపరాదు. గాంధీమహాత్ముఁడు "స్త్రీలవిషయమై వ్రాయునపుడు మాతృభావముతోను ఘనమగు ప్రేమభావముతోను వ్రాయవలె" నని బోధించియున్నాఁడు మఱియుఁ బద్యముల శీలసుందరములుగాఁ గూర్పవలయును.

"Poetry is primarily intended to inculcate moral virtues." అని శుక్లపక్షపీఠికలో M. V. నరసింహాస్వామిగారు క్రోడీకరించి యున్నారు. అనఁగాఁ బద్యరచన నీతిబోధకముగా నుండవలయు నని భావము.

ప్రాచీనకావ్యనాయకులయొక్కయు, నవీనకవినాయకుల యొక్కయు వియోగగేయముల నీక్రింద నుదాహరింతును. వీనియం దేవి మనోహరముగా నున్నవియో పాఠకమహాశయులు నిర్ణయింతురుగాక.

## కావ్యనాయకవిరహతాపములు

"ఎచ్చటికేఁగితే కువలయేక్షణ! పల్కవదేల? కోమలీ!
ముచ్చటలాడ రావలదె మోహనరూపిణి! యుల్లముంబూని స
న్నిచ్చలుబాసి పోవఁదగవే మధురాధర! యీవనంబులో
నెచ్చట నున్నదానవో మహీసుత! వేగమె మోముఁ జూపవే."
"కనుఁగవమోడ్చు నుస్సురను గంపముఁగొంచుఁ గడుందలంకుహా
జనకకుమారి! యంచుఁ బలుచందముల న్విలపించు లక్ష్మణా!
వనజసుగంధిజాడఁ గనవా యను మాటికిఁ జీరు దైవమా!
యను వనితావియోగజనితార్తిఁ దపించుచు రాముఁడయ్యెడన్."
"ఎక్కడ నల్కుఁ డైనఁ దరళేక్షణ వచ్చునటంచుఁ జూచు నే
యిక్కువఁ జప్పుడైనను మహీసుతపల్కని యాలకించు నే
దిక్కు తళుక్కుమన్న సుదతీమణిమైజిగిగాఁ దలంచు లో
నక్కజమైనమోహమున నారఘునాథుఁడు భ్రాంతచిత్తుఁడై."
"వనజముఖినిఁ గూడి వర్తించునాఁ డెవ్వఁ
డధికసౌఖ్యకారి యై తనర్చె
నట్టిపవనుఁ డిప్పు డాసతి లేకుంటఁ
జేసి కాల్పఁదొడఁగెఁ జిచ్చుఁ బోలి."
"ఇట్టిరమ్యవనంబునఁ నిట్టివేళ
నుత్పలేక్షణ నాయొద్ద నుండెనేని
యుష్ణకరవంశతిలక! యయోధ్య నైన
నింద్రపదమైనఁ దృణముగా నెంతుఁ గాదె."

## కవినాయకవిరహతాపములు

"ఇపుడు వత్తువా నీకొర కెదురు చూచు నీవియోగి
యెడద మంచుజడులు కురియును, మా పేమో, రే పెటకొ
వెడలి చనునో, నిదుర మునుగునో!"

"నీమనోజ్ఞ కాంచన, కాంచీమణిఘంటాగళములు
ఏకాంతము కరగ మ్రోయగా, విన నరచే బ్రతుకు దాల్చి
యెడద మ్రోత కెంత యేడ్తునో."

"ఎన్ని యెన్ని విశ్వాసము లెగసినవియొ
ఈబ్రతుకె రూపుమాసి పోయినది గాని,
ఇంత విశ్వమ్ములో జాలి నింత నీడ
ఒదవగా లేద యొక్క నిట్టూర్పునకు."

"స్వాగతాశ్లేషమున విడజాలు నెదల
నల్ల ద్రావిత మున్ను దోసిళ్ల కొలది,
వలపుటాకలి స్రుక్కు నాబ్రతుకుమీద
ఇనుపపాదాల నిడి లోక మిపుడు నడుచు!"

"రేయికడుపున చీకటిచాయ వోలె,
తమసు కెడద దివాంధగీతము విధాన,
ఘూకరావాన వలవంత రేకరీతి,
నా విషాదమ్ములో దాగినాడ నేనె."

—♦ కావ్యనాయకవిరహతాపములు ♦—

"స్మితహాస్యాంతరయుతమును
హిత మతులము మధుర మమృత మగు నాధాత్రీ
సుతవాక్య మింక నెన్నఁడు
వితతగుణా! వీను లలర విన నగు నాకున్."

(గోపీనాథుని వేంకటకవి—ఆంధ్రరామాయణము.)

"గొప్పతప్పిదము చేసినప్పుడైన
నవమతిని జూపియెఱుఁగని యన్నమిన్న
నిరపరాధిని నన్ను మన్నింప వేల?
యొప్పుగాఁ బల్కరించి నీ వొక్కమాఱు."

"అడుగకయె నీవు నాయుండి యుక్కటకట!
మరల రాకుండఁ బరలోక మరుగుకతన
నోశుచిస్మిత! సత్యమై యొప్పుప్రేమ
నీయెడల లేనిశఠుఁడ నే నిజము దెలిసె."

"అప్రియము నీకు ము న్నెన్నఁ డాచరింపఁ
జిత్తమునఁగూడ నన్నుఁ ద్యజింప నేల?
పేరునకు భూమిపతిఁ గాని ప్రేమచేత
బద్ధుఁడను నేను నీయందు భావమందు."

"సుమచయముతోడ భృంగవర్ణముల నొప్పి
గాలిఁ గదలెడు నీకుటిలాలకములఁ

## —♦ కవినాయకవిరహతాపములు ♦—

"అయ్యయో ఊర్వశీ విషాదార్ద్రమూర్తి
ఈనిశీథాన, నాహృదయాన నిండె
పూర్ణమాసుభ్రయామిని బాగ్గువోలె
ఈయెడద వోలె కాలిపోయినది నేడు."

(దేవులపల్లి కృష్ణశాస్త్రిగారు—వైతాళికులు.)

"ప్రేయసీ!, యేల వింటి నీపేరు నేను
ఆలకించినదాంది నామహాక్షరముల
నేమి వింతయోకాని మదీయహృదయ
దుగ్ధవార్ధిని మథన ముద్భూతమయ్యె."
"అధికమైనకోలందిని మథన మకట
ఉద్గమించెను కాలకూటోగ్రవిషము,
ప్రేయసీ! నిప్పితిని దాని బిగియబట్టి
కంఠమునహారమునందు శంకరునిభాతి."

"క్రీడ నెటులైన నొకసారి విడిచి ముగ్ధ
తెలిపి నీప్రేమ కావుమీ దీనజనుని!
ప్రాణములు పోవుచున్నవి- పలుక వేమి
యిప్పటికినైన? అకట, నే నేమిచేతు!"

"అన్యవశవర్తి గాక యిచ్ఛానుసార
గతిని జరియించు నీమతంగజము నార

—♦ కావ్యనాయకవిరహతాపములు ♦—

జూడ నూపిరి మరల ని న్గాడు నేమొ
యనెడుశంక జనించు నామనమునందు."
"లోనిభృంగాళి రొదలను మానియుండ
రేయి నిదురించు నేకనీ రేజమట్టు
లలక లిటునటుఁ జెదరి మాటలను వీడి
యున్న నీమోము న న్నేఁచుచున్న దకట!"
"జంట దిరుగుఖగాళిలోఁ జక్రవాకి
చక్రవాకమ్ముతో రాత్రి చంద్రుతోడ
మరలఁ గూడును గావున విరహ మోర్చుఁ
గ్రమ్మరక చన్న నీవు న న్గాల్ప వెట్లు?"
(ఆదిపూడి సోమనాథరావుగారు—ఆంధ్రరఘువంశము.)

"నాపైఁ జిత్తము లెప్పుడు న్నిలుపుచు న్నారాకఁ గాంక్షించుచు
న్నాపే రాత్మల నావహించుచు వగ న్నానాప్రకారంబులన్
గోపాలాంగన లెంతజాలిఁ బడిరో కోపించిరో దూఱిరో
ప్రేపల్లె న్నిజధర్మగేహములలో విభ్రాంతచైతన్యలై."
"రమ్మా యుద్ధవ! గోపకామినులు నారాక ల్నిరీక్షించుచున్
సమ్మోహంబున నన్నియు న్మఱచి యేచందంబునం గుందిరో
తమ్ము న్నమ్మినవారి డిగ్గవిడునన్ ధర్మంబు గాదండ్రు వే
పొమ్మా ప్రాణములే క్రియన్నిలిపిరో ప్రోద్యద్వియోగాగ్నులన్."
(పోతన—భాగవతము.)

— ♦ కవినాయకవిరహతాపములు ♦—

కట్టినావు భవద్గుణగణముతోడ
ఇట్టి యాధోరణత నీకు నెట్లు కలిగె."
"అయ్యయో, యేల చూచితి వట్లు నన్ను
ఆదినమ్మున మధురసాయాహ్నమందు
దేహళిని నిల్చి మోహినీదృష్టితోడ
పథమువెంబడి జనెడి విభ్రాంతహృదయు."
"ఏమి హృదయాపహారిణీ, యింకనైన
కరుణ వహియించి పీనిని కావదగవె!
బహుళతాపముచే మతి భ్రంశ మొంది
వివశమైపోయె; అయ్యయో, వెర్రినైతి!"

(తల్లావఝుల శివశంకరశాస్త్రిగారు—వైతాళికులు.)

నిన్ను, జూడక బ్రతుకలేనే, నిన్నుఁ గలియక నిలువలేనే
నన్ను మసకల కన్నులో నిలు, పకవె ప్రియురాలా!
చుట్టుఁ బావక భీషణార్చులు, ముట్టుకొని నను గ్రమ్మివేసెను
ఒకఁడ, దీనుఁడ, నోసి! యశర, ణ్యుఁడను నార్తుఁడనే?
విడచిపోతివ? నన్ను గాటపుఁ
గలఁత విషములఁ గాల్చివైతువ?
యేడ్తునే, కృశి యింతునే, నశి
యింతునే రాణీ!

(శ్రీరామచంద్ర అప్పారావు—నీలిరత్నాలు.)

ఈనవ్యకవినాయకవియోగగేయములయందుఁ గల యమూల్యప్రణయరాజ్యలక్ష్మీసౌభాగ్య మేదియో తెలియరాకున్నది. కాని నవ్యసాహిత్యమునకుఁ గీర్తిసంపదలఁ గొనివచ్చిన వీవియోగగేయములే యని నవ్యసాహిత్యమువారు నాట్యమాడుచున్నారు.

ఇంక వీరిపద్యపాదముల యసమానరచనావైభవమన్ననో! పొట్లకాయవంటి బారెఁడుపాద మొకటి; ములక్కాడవంటి మూరెఁడుపాద మొకటి; కాకరకాయవంటి జానెఁడుపాద మొకటి; కరక్కాయవంటి యంగుటపుపాద మొకటి—యి ట్లెట్టిపోలికయు లేక, వికారముగాఁ జూపట్టును.

"కనుమూసి లేచాను, వెనుదిరిగి చూశాను
కనలేను ఆజంట, వినలేను ఆజాడ
గుండె గుబగుబలాడె
నాగొంతు." (వైతాళికులు—బంగారమ్మ.)

"ఎంత చోద్యపుఁగాంతి యొదవిన
నంత కెక్కువ యైన దెంతు
ప్రణయలోభిని నేనే
నేనే." (కవికొండలవారు.)

"వెతికి వేసారినా వెఱ్ఱిబ్రతు కెపుడేని
తుదిరేయి కనుమూయునా
బేలనై
నిదురబరువులఁ గ్రుంగునా." (కృష్ణశాస్త్రిగారు.)

నవ్యసాహిత్యకవులకు శబ్దానుశాసనముతోఁ గాని, ఛందోనియమములతోఁ గాని, కావ్యగుణములతోఁ గాని, తుదకు బాషభీతితోఁ గాని పని లేదు. నోటికివచ్చిన ట్లుచ్చరించుటయు, కలమునకు నచ్చినట్లు వ్రాయుటయు, స్వభావమైనట్లు స్పష్ట మగుచున్నది. ఈరీతి నిరంకుశకవులఁగూర్చి యిట్లు వ్రాయఁబడినది.

శ్లో॥ స్వాధీనో రసనాంచలః పరిచితాః శబ్దాః కి యంతః క్వచిత్
క్షోణీంద్రో న నియామకః పరిషదః శాంతాః స్వతంత్రం జగత్
తద్యూయం కవయో వయం వయ మితి ప్రస్తావనా హ్యాంకృతి
స్వచ్ఛందం ప్రతిసద్మగర్జతవయం మౌనవ్రతాలంబినః॥

అనఁగా నాలుక మీయధీనమున నున్నది. మీకుఁ గొన్ని మాటలు అలవాటు లయినవి. భాషాపరిషత్తులు మౌనముద్రితము లైనవి. కవితను శాసించుతేఁడు లేఁడు. జగము స్వతంత్రము. కావునఁ గవులారా! మేము కవులము మేము కవులము అనుచు నింటింట గర్జింపుఁడు. మే మడ్డు రాము- అని భావము.

దివ్యవిగ్రహసందర్శనమువలనను, సత్కావ్యాలోకనమువలనను చూపరుల కుదారభావము లుదయింపవలయును గాని, నింద్యాశయములు జనింపరాదు. కావున దేవతాకృతుల నిర్మించు శిల్పులును సత్కృతుల రచించు కవులును ఆకృతి కృతిరూపముల పావనత చెడకుండ జాగరూకులై, నిజనైపుణ్యముల ప్రకటింపవలయును.

శిల్పి మృత్పాషాణసువర్ణాదులలోఁ దనకు లభ్య మగు పదార్థమును దీసికొని, దివ్యవిగ్రహముల నిర్మింపవచ్చును. కాని దేవతారూపములఁ గాంచినతోడనే భక్తి భస్మమైపోవు నట్లు నింద్యముగా సృజింపరాదు. అటులనే కవియు గ్రామ్య వ్యావహారిక గ్రాంథికభాషలలోఁ దనకు సాధ్య మగుభాషను జేకొని, కావ్యముల రచింపవచ్చును కాని, ఔచిత్యమర్యాదల దగ్గ మొనర్చి, నీచభావము లుదయించురీతినిమాత్రము రచ నము సాగింపరాదు.

మఱియుఁ దమకుఁ బురాణేతివృత్తములు మానవసహజ ములు కా వని తోఁచినచో, వానిని త్యజించి, వారియూహాల కను వగుకథలఁ గల్పించుకొని, తమయిష్టానుసారము పాత్రల సమకూర్చుకొన నగును. అంతియేకాని భాగవతావతంసుఁ డగు ప్రహ్లాదుని పరకాంతలకై పరుగెత్తించుటయు, ఆజన్మబ్రహ్మ చారి యగుశుకుని సుఖవ్యాధులపా ల్సేయుటయు, సత్యహరి శ్చంద్రునిచే కూటసాక్ష్యము లిప్పించుటయు లోనగు అపవిత్ర కృత్యముల వర్ణించుట తగవు కాదు.

పావనము లగు పురాణచరితములఁ బ్రాణతుల్యముగాఁ దలంచు సంసారుల కర్ణపుటములలో నసభ్యభావకవిత్వమ్మన్నాయ పాత్రతో నవినీతితైలమును మఱగించి పోసి, పీడించుట శ్రేయ స్కరము కాదు. ఇది యహింసాత్మక మన్నమాట మఱవఁదగదు.

కావ్యమును వినినంతనే నాదసంపదచే సంతోషసాగర తరంగములపై నర్తనము సేయించుచు, ఆలోచించినకొలంది సుభావామృతధారలచే నానందింపఁజేయుచు, దేశభాషలలో నన్నివిధముల మిన్న యని యెన్నిక గాంచిన త్రిలింగభారతీ సౌభాగ్య మింతటిహీనావస్థకు వచ్చుచున్నదే! యను పరితాపము పెక్కురు సంసారులఁ బీడించుచున్నది.

భాషాస్థవ మెట్లున్నను భావముమాత్రము పాప పంకిలముగా నుండరాదు. మధుర మగుపాయసమును సువర్ణ పాత్రములో నుంచినను, ఇత్తడిగిన్నెలో వేసినను, లేక యాకు దొన్నెలోఁ బోసినను, పేయమే యగును గాని హేయము కానేరదు. ఆతీరుననే భావౌచిత్యరుచ్య మగుసచ్చరితము గ్రాంథికవాణిలో నున్నను, వ్యావహారికభాషలో నున్నను, గ్రామ్యపదములలో నున్నను, గ్రాహ్యమే యగును గాని పరిహార్యము కానేరదు. పాఠకు లాస్వాదించునది ఆధేయ మగుమధుర పదార్థము గాని ఆధారము లగుపాత్రలు కావు.

తులసీదా సిట్లు బోధించియున్నాఁడు.

"శ్యామసురభి పయవిసదఅతి, గుణదకరహి సబపాన్"

అనఁగా స్వచ్ఛమధురము లగుపాలను త్రాగఁగోరువారు గోవు నలుపును గ్రహింపరు- అని భావము.

పాయసదాతలభాగ్యానుసారము భాజనములవిలువ హెచ్చునట్లు కవులసామర్థ్యానుసారము బాసలవెల హెచ్చును.

కాని కాలకూటమును పేయముగాఁ జేయునపుడు గిన్నెలవన్నెనుబట్టికాని, నింద్యభావముల నందిచ్చునపుడు బాసలపసందునుబట్టిగాని, గ్రాహ్యత యేర్పడనేరదు. అందుచేఁ గవి కావ్యమునఁ జేకూర్చువిషయము రుచ్యమై, పావనమై, నీతిదాయకమై, సంఘమునకు మేలుకు సమకూర్చునదిగా నుండవలయును గాని, సంఘశీలమును నశింపఁజేయునదిగా నుండరాదు.

కవిత యన వాసంతికకోకిలకాకలీమోహననాదమువలె శ్రావ్యమై, తెల్లచెఱకుపానకముపగిది తీయనై, శారదనదీనీరము రీతిని నిర్మలమై, హరశిరశ్చంద్రచంద్రికాప్రసారమువడువునఁ గాంతిశోభితమై, జాహ్నవీరసపూరముచాడ్పున పావనమై, మందమలయానిలమువలెఁ జల్లనై, సరోజసుమదళములపోలిక మంజులమై వెలువడవలయును గాని, తీతువకూఁతలవలె నమంగళమై, చొప్పదంటుబెండువలెఁ జప్పనై, రథ్యానీరములవలె కశ్మలమై, పగటిచందమామచందమునఁ గళావిరహితమై, కాపిశాయనరసమువలె నపేయమై, వేసగిగాడ్పుచాడ్పున వెచ్చనై, కంకరఱాలవలెఁ గఱకై యుండరాదు. కావున నవ్యకవిసోదరులు వారి కను వగుబాసను జేకొని; సొంపగుభావకల్పనములతోఁ గబ్బముల వ్రాయనగును. అంతియకాని దేశమునకుఁ దలవంపులు గొనివచ్చు అసభ్యవిషయముల వర్ణింపరాదు.

పావన మగు కవితారమణీరామణీయకమును వర్ణించునపుడు కవివరునిరసన యెంతటిరసపరవశమై యుండవలయునో

కవిసోదరులు యోజింతురుగాక. పూజింతురుగాక భక్తిమర్యాదలతో త్రిలింగభారతీపదరాజీవముల.

## —♦ భా వ సా హి త్య ప్ర శం స ♦—

మింట చుక్కలకుఁ బ్రక్క తోఁకచుక్క లుదయించునట్లు త్రిలింగులయింట గ్రాంథికకవిత్వమునకు జంటగా భావకవిత్వ మనుపేరుతో నొకయపూర్వకావ్యసృష్టి తల యెత్తుచున్నది. దీనియందు పదములకూడిక కనుపట్టును కాని హృద్యము లగు భావములపొందిక చూపట్టదు. అందలిభావము వెలువారికే కాక, ఆకవితాసమితివారికిఁగూడ ఆకాశహర్మ్యముగాఁ గానవచ్చును.

భావకవి ప్రత్యక్షమైనపుడు "ఆర్యా! మీ యీపద్య భావ మేమి?" అని యడుగ, "నాపని పద్య మల్లుటయే కాని భావము వివరించుట కాదు. దానిని నీవే యన్వేషింపుము" అని తెలుపును. ఓహో! ఏమి యీవింతసమాధానము! నువ్వులను పండించుట కృషీవలునికృత్యమును, వానినుండి నూనెను పైకిఁదీయుట గానికవానిపని యైనట్లు, భావకవిత్వమును సృష్టించుట కవికార్యమును దానియందలి భావమును దీయుట లోకుల కృత్యముగను గనుపట్టుచున్నది.

వీరివ్యాఖ్యానములును, నిర్వచనములునుగూడ మింటి కెగసియుండును గాని జనుల కందుబాటులో నుండవు.

"భావశబలత రసపిపాసులహృదికి నాస్వాదింప సాధ్యము అగును గాని కేవలశబ్దార్థదృక్కులకు జిక్కదు. రససమాధి మగ్నుడగు కవివరుడు తన్మయతతో కవిత నల్లును కాని భావమును స్థిరము చేసికొని పిమ్మట పద్యమును లిఖింపడు. కావ్యము నందలి పదసౌష్ఠవమును జూచువారును, భావమును తెలియ గోరువారును కవి సాహిత్యసమాధిలో ననుభవించిన యానందమును దెలియఁజాలరు. అది యోగదృగ్గోచరము."

"కవిభావము లోకమున కందుబాటులో నుండదు. అది రసమయహృదయుని మానసాంతరమున మరుగుపడియుండును. మాణిక్యమువంటి ఆభావసుధను ఆస్వాదించువాఁడు కవియంతటి మేధాశాలియు రససాధనచతురుఁడును కావలయును."

"కడలికడుపున నెన్నెన్నో యల లుదయించును. గంభీర హృదయమున నెన్నెన్నో తలపుకెరటాలు తమంతతాము పుట్టి పొంగి పొరలును ఇవి సాహితీపత్రమున దోచినపుడు ఆనంద గీతిక వెడలి అంతరంగమునందలి వీనులకు విందొనర్చును. సింధు గర్భమున నందందు దీవులుండునట్లే సహజరచనమున నందందు (Quotations) వుండవచ్చును. ఎంత చక్కనిదీవులైనను సాగర సంగీతము నాలింపగలవా......సాహిత్యాంగణమున మంజుల గీతిక నాలాపించునవి సహజశక్తిసముద్భవభావములే కాని కంఠస్థములు గావింపబడి మరల క్రక్కబడిన (Quotations) కావు."

"ఛందోబద్ధమైనదే కవిత్వమని ఒక అభిప్రాయము. అది పద్యరచన ఔతుంది కాని కవిత్వము కాదు. పద్యరచన కవిత్వము ఏకమయ్యే పరిపూర్ణావస్థ ఒక్క వ్యక్తిలో చాలాకాలానికి గాని రాదు. సాధారణంగా పద్యరచన కవిత్వము తేడాగానే వుంటున్నాయి అని చెప్పాల్సి వుంటుంది. సంపూర్ణానుభవంవలన కలిగిన తన్మయత్వంచేత జనించిన భావోద్రేకమే కవిత్వమంటారు...... పద్యంకోసం పద్యం వ్రాసినపుడు దాని యర్థం విప్పి చెప్పుట సులభం కాని తన్మయత్వంలో భావోద్రేకంతో వ్రాసిన కవిత్వానికి అర్థం చెప్పాలంటే అనుభవంవల్ల కాని తెలియదు. తత్సమానమైన అనుభవం కలవారికి ఆ పద్యం అర్థం కావచ్చు లేనివారికి చెప్పుట కొంత దుస్సాధ్యము."

"మన ప్రాచీనులు బాహ్యసృష్టిలోనుంచి ఒక రసమయాంశాన్ని గ్రహించి కావ్యసృష్టి చేశారు. అందుచేత వారిది పరాశ్రయకవిత్వ మయింది. ఆధునికుల ప్రణయకవిత్వం ఆత్మాశ్రయరూపం పొందింది. అంతే భేదం యీరూపపరిణామానికి కారణం ప్రక్రియావైవిధ్యం. యిదికాక ప్రాచీనకవిత హృదయ సంజనితమైన భావాలను కావ్యనాయకునికి ముఖ్యంగా స్వీయ భావాలను వ్యక్తం చేశాడు. ఆధునికకవికుమారుడు తానై ప్రత్యక్షంగా స్వయంభావాలను వ్యక్తం చేశాడు. రెండో మార్గమే రసానుభూతికి ఎక్కువ పోషకం. ఈవిధమే పాఠకుడి మనస్సునకు ఎక్కువ హత్తుతుంది."

వీనిభావము సుబోధము కాదు. ఇట్టివ్రాతలఁగూర్చి ఉదయినిలో శ్రీ దువ్వూరి రామిరెడ్డిగారు ఏమివ్రాసిరో కనుఁడు:

"తనభావ మితరులకు ఎఱుకపడనియంత క్లిష్టసంజ్ఞలతో ప్రకటింపఁబడియున్న ఆపద్యములు మూగ, చెవిటివారలసంభాషణమువలె వ్యర్థ మగును. కావ్యప్రయోజన మందు శూన్యమగుటవలన దానికి కావ్యత్వహానికూడ సిద్ధించును."

ఈవిషయముననే శ్రీమాన్ ప్రతివాదిభయంకరంవారు పద్మనాయికపత్రికలో నిట్లు వ్రాసియున్నారు.

"తల గొట్టిగొన్న నర్థముచిక్క విడబోని, యాధునిక కవితావాసన వీరి కంటినట్లు లేదు."

శ్రీ ఉమాకాంతపండితులవా రిట్లు తెలిపిరి.

"అస్ఫుటస్వల్పార్థవచ్ఛబ్దబాహుల్య మేవ ఆధునికకావ్యేషు ప్రాయః ఉపలభామహే" అనఁగా నర్థరహితములగు శబ్దములబహుళతయే నవీనకావ్యములఁ గాననగునని భావము.

శ్రీ మహామహోపాధ్యాయ తాతా సుబ్బారాయ శాస్త్రిగారు ప్రతిభలో నిట్లు వివరించిరి.

"తమఆశయములను పరులకు వెల్లడించడమే భాష యొక్క ముఖ్యప్రయోజనము. అది సిద్ధింపకపోయేయెడల భాష వ్యర్థము."

కొండను ద్రవ్వి యెలుకను బట్టినట్లు నవీనవాక్యగిరుల నుండి భావమూషికముల గ్రహింపవలయును. ఇట్టివ్రాయుస

కాంద్రు ప్రాచీనకావ్యములయందలి రచన లర్థములు కాక పాషాణవ్రాతములవలె నుండు నని పరిహసించుచుందురు !

నవ్యసాహిత్యసోదరులు కొంద ఱుద్రేకప్రాభవముచేఁ దొరపడి వ్రాయ మొదలిడుదురే కాని, తాము వ్రాయఁబూనిన దానిని ఓర్పుతో సమన్వయించుకొని, ప్రకటింపఁ బ్రయత్నింపరు. కావుననే సందర్భశుద్ధి లేనినిర్వచనములు చూపట్టు చుండును. కనుఁడు: "అరిగిపోయిన అలంకారాలే ధరిస్తూ చివికిపోయిన రసపాకములోనే పొట్ట నింపుకుంటూ, జీవచ్ఛవమై వుంటుంది. ఒక కవి చెప్పినట్లు - కట్టుబాట్లలో కవిత్వము, సంకెలలో సంగీతము, యెట్లు సాధ్యమవుతవి." (ప్రతిభ.)

ఈపైవిషయ మాలోచించి వ్రాసిరో ! లేక లోకాతీత మగునుద్రేకసమాధిని ప్రకటించిరో ! ఏమందురా ? విలువలేని ఆదొడవులఁ దొడుగుటకంటె అరిగిపోయిన సువర్ణాలంకార ముల ధరించుటయే మేలు. అమంగళము లగు నూతనసంకర పాకముల నాస్వాదించుటకంటె పాత్రశుద్ధి గల సనాతనపు పాకముల రుచిచూచుటయే లెస్స. ఇంక వీరి కొకకవివరుఁడు చెప్పినమాట లెంతపేలవముగా నున్నవియో కనుఁడు: "కట్టు బాట్లలో కవిత్వము" అనుట అనాలోచితపుమాట. ఇట కట్టుబా ట్లన వ్యాకరణాదిశాస్త్రవిధు లనియా భావము ? లేక కారా గారబాధ లనియా యర్థము ? ఈరెండును సరిపడవు ! మన ప్రాచీనకవులు నవరసభరితము లగుకావ్యములు రచింప లేదా ? శ్రీ కొడాలి ఆంజనేయులుగారు "జైలులో" అనుశీర్షిక

క్రిందఁ బ్రతిభలోఁ బద్యరచన సాగించియున్నారే! యి దెట్లు పొసఁగును?

మఱియు "సంకెలలో సంగీతము" అన్నమాటకూడ సారదూరము. ఎందఱుభాగవతోత్తములు సంకెలలో సంకట పడుచు ఆపన్నరక్షకుఁ డగుపన్నగశాయినిగూర్చి జగన్మోహ నముగా గానము చేసి యుండలేదు! వనజ మగు గజమును, బాలుఁ డగు ప్రహ్లాదుఁడును, అబల యగుద్రౌపదియు, యువకుఁ డగుసారంగధరుఁడును, ప్రౌఢుఁ డగుజయదేవుఁడును, కష్టపరం పరలలోఁ జిక్కుకొనియే కదా! నిజగేయనాదములచే లోకము ముగ్ధ మగునటులఁ జేసియున్నారు!

ఎచ్చటివారిమాటయో యెందుకు? మన తెలుఁగునాఁటి భక్తుఁ డగుగోపన్న కారాగారబాధల ననుభవింపనేరక "అబ్బబ్బా దెబ్బలకు" లోనగుపాటలఁ బాడియుండలేదా? ఇటీవల నిట్టల ప్రకాశకవివరుఁడు కాళ్లేతులు కట్టి తన్ను గోదా వరిలో పడవేసినప్పుడేకదా! గౌతమీతరంగనీరము లుప్పొంగు నట్లు కృతులను బాడినది? అంతదూర మెందులకు? మొన్నటి వఱకు అసహాయవాదిసోదరులు చేపాటిప్రేటులలో జాతీయగీత ములఁ బాడియుండలేదా? ఈవిషయములఁ గొంచెమైనను చూచుకొన వలదా? వేగిరపాటుపై నాధారపడ నగునా?

ఇఁక నొకవింత! ఈనవ్యసాహిత్యప్రియులు భావనిర్వ చనములఁ జేయునపుడు పరస్పరవిరుద్ధభావములఁ బ్రకటించు

చుండుము. ప్రేమ యనునది ఈశ్వరకళ యనియు, దానితత్త్వము అనుభవైకవేద్య మనియు, అది పుట్టినదిమొదలు గిట్టువఱకు నొక్కరీతిని వెలయుచుండు ననియు, అట్టిప్రణయకల ఈశ్వర సృష్టిలో వేఱొకటి లే దనియు సోదరకవులు ప్రకటించుచుండ, వారిలోని వేఱొకనవ్యకావ్యసుధాకరుఁడు ఏ మనుచున్నాఁడో కనుఁడు:

"మరివకర్ని ఒకరు ప్రేమించడం అనేది ఏమిటి? నరాల బాధ. అదే ప్రేమగా పరిగణింపబడుతూన్నది. సరియైన ప్రేమకు నిర్వచనం లేదు. ప్రేమగలవాళ్లమధ్య మైధునం లేదు."

(వినోదిని.(

ఇట్టివిషయము లనేకముగా నున్నయవి. స్థాలీపులాకన్యాయముగాఁ గొన్నికొన్నివిషయములఁ బేర్కొంటిని. కొందఱు విద్యార్థిను లగుసోదరులు "ఈసాహిత్యరచనలగూర్చి నీ వేల వ్యాకులపడెదవు? వీనిం జూచువా రెవ్వరు?" అని నాతో బల్కిరి. కాని యీసోదరులు ఆంధ్రయువతీయువకులు పఠించుచున్నవి. యీనవ్యశృంగారప్రబంధములే యన్నసంగతి తెలియకున్నారు. ప్రస్తుత మీసాహిత్యము విరివిగాఁ జెలరేఁగుచున్నది. ఇవి నామాటలు కావు. నవ్యసాత్యప్రియులు ఆంధ్రదేశము నంతను నవ్యసాహిత్యము వ్యాపించుచున్న దనియు, దీని నడ్డుటకు నేరికిని సాధ్యము కా దనియు ప్రకటించుచున్నారు.

ఈనవ్యసాహిత్యవిశ్వవిద్యాలయమునకుఁ గులపతు లనఁ దగు మహారాజశ్రీ రావుసాహెబు గిడుగు రామమూర్తి

పంతులవారు ప్రతిభలో నవ్యసాహిత్యప్రతిభనుగూర్చి యిట్లు తెలిపియున్నారు.

"నేటి సాహిత్యం అనంతవిశ్వమంతా ఆక్రమిస్తున్నది. ......నేటి లోకానికి వుపకారము చేయవలెనంటే నవ్య సాహిత్యం కావలె. భారతాదులలోని నీతులు యిపుడు పనికి రావు." ఇట్లు తమసాహిత్యము త్రిలింగదేశమును అలమికొను చున్న దని తెలుపుటయేగాక పైపెచ్చు భారతాదులలోని నీతు లనుగూడ పనికిమాలినవానినిగా నిర్ణయించిరి. కాని యిది సాహసప్రవ్రాంత.

భారతాదులలోని గ్రాంథికభాష వీరికి పనికిరాకపో వచ్చును; వానియందలి వర్ణనములు నచ్చకపోవచ్చును; అంతే కాని వానియందలి పూతము లగునీతులుకూడ పనికిరా వనుట సాహసోక్తి కాదా? వీరు సెలవిచ్చినటుల భారతాదులలోని నీతులు పనికిరాని వైనచో "కన్నుదోయికి నన్యకాంత లడ్డం బైన మాతృభావము చేసి మఱలువాఁడు" లోనగునీతులు పాటింపఁదగినవి కావా? ఈనీతులఁ దొలఁగించి, వీనికి ప్రతి నిధిగా నవ్యసాహిత్యవిశారదులు నిలువఁబెట్టు క్రొత్తనీతు లెవ్వి?

విద్యావయోవృద్ధు లగు శ్రీ పంతులవారు క్రుద్ధులై యున్నపుడు ఈరీతిగా వ్రాసియుందురు. శాంతాత్ము లైనచో నిట్టివిరుద్ధవాక్యములకుఁ దా వొసంగియుండరు. శ్రీ పంతుల వారు ఏహేతువుచే భారతాదులలోని నీతులు ఇపుడు పనికిరా

వని వ్రాసిరో! తెలియరాకున్నది. నీతులు ప్రాంత తైన బూతు లగునా?

భారతభాగవతరామాయణాది ప్రబంధములయందలి నీతులు మానవకళ్యాణమునకుఁ ప్రధానసాధనము లని, స్వదేశ విద్వాంసులే కాక ప్రాజ్ఞు లగు విదేశపండితులుకూడ ప్రశంసించుచుండ మనభారతమాతకడుపునఁ బుట్టిన యాంధ్రసోదరు లెట్లు పలికిరో! కంటిరా! వింటిరా! యెప్పుడైన నిట్టివిపరీత భాషణముల? ఔరా! నేఁటి నవ్యసాహిత్యపురుషపుంగవులు భారతనీతిచంద్రికల కెట్లు మసి పూయఁ బ్రయత్నించుచున్న వారో!—

భారతాది ప్రబంధరాజములఁగూర్చి శ్రీ శ్రీ పిఠాపురం మహారాజా వా రేమిసెలవిచ్చిరో వినుఁడు: "సద్ధర్మబోధకములై మనలను నీతిప్రవర్తనులనుగాఁ జేయుశక్తి వీనికిఁ గలదు."

(రజతోత్సవసంపుటము.)

శ్రీ మహారాజావారు గ్రాంథికాంధ్రగౌరవాభిమాను లగుటచే ఇట్లు వ్రాసి రందురా? నవ్యసాహిత్యరంగమున పేరు గన్న నోరి నరసింహశాస్త్రిగారు "కావ్యప్రయోజనము" అను వ్యాసరాజమున ఏమివ్రాసిరో పరికింపుఁడు. "రామాయణమూ, మహాభారతము, భాగవతమూ యీలాంటికావ్యాలు లోకాన్ని ఎక్కువ వుద్ధారం చేసినవి."

(ప్రతిభ.)

ఇంద్రకంటి హనుమచ్ఛాస్త్రిగారు ప్రతిభలోఁ బురాణముల నెట్లు ప్రశంసించిరో! కనుఁడు: "భారతీయసాహిత్యానికి

విజ్ఞానసర్వస్వా లయిన పురాణాలు అద్భుతవిషయభాండాగారాలు."

గృహలక్ష్మి యీవిషయమునుగూర్చి ఏమి బోధించుచున్నదియో కనుఁడు: "ఆదియందే భారతజాతియందలి ప్రాముఖ్యమును గమనించి, జీవితమునందలి హెచ్చుతగ్గులు గల యన్నియంతస్తులవారికి స్త్రీపురుషులకు ఆదర్శముల నిరూపించిరి. యీ ఆదర్శములతో రచింపఁబడినవియే రామాయణభారతాది గ్రంథములు. వీనియందలి యాదర్శములు సర్వకాలసర్వావస్థల స్త్రీపురుషుల కాదరణీయములు."

సకలవిద్యాపారంగతులై ఖండఖండాంతరములఁ దమ విజ్ఞానచంద్రికలఁ బ్రసరింపఁజేసి, యసమానమేధాసంపన్ను లని ప్రఖ్యాతి గాంచిన వివేకానంద, రామతీర్థ, రవీంద్రనాథ, అన్నాబాయి, నివేదిత, లోనగుప్రాజ్ఞులు మానవసంఘకల్యాణమున కనువగు నీతిధర్మముల బోధించుగ్రంథములు భారతరామాయణములే యని, శంఖారావముతో సాటియున్నారు. వారియుపన్యాసములఁ బరికించినచో నీవిషయము విదిత మగును.

కావున శ్రీ రామమూర్తిపంతులుగారు భారతాదుల యందలి నీతులు ఎందువలనఁ బనికిరా వనిరో? సహేతుకముగా లోకమునకు వెల్లడింపవలసి యున్నది.

—♦ హితబోధలు ♦—

నేఁటినవ్యకవితాసృష్టి దేశారిష్టదాయకముగా నున్న దనియు, దానిని నివారింపకున్న సంఘము పాడగు ననియు

దేశకళ్యాణముపై ఆస గల సతీలలామలును, సజ్జనులును, వేనోళ్ల బోధించుచున్నారు. కవితాతిలక కాంచనపల్లి కనకాంబ గారిబోధలు —

"నన్నయచిన్నయల్ మొద లనన్ దుదిగాఁ గల గ్రంథరాజిలో
నున్నత మైనభావములె యున్నవి మొన్నను నిన్న నేఁడో య
న్నన్న అసభ్యభావము లనంతము పొత్తములందు నచ్చులై
వన్నెకు నెక్కి సత్కవులవాక్కుల నొక్కుచు నున్న వక్కటా!"

"అరయన్ బ్రహ్మమె యీ రసం బనుచు బ్రహ్మజ్ఞాను లన్నారు దు
ర్భర మా గ్రామ్యరుతంబుల న్వినఁగఁ గర్ణంబు ల్గదున్నొచ్చు నీ
శ్వర! యెట్లోర్వఁగవచ్చు బ్రహ్మమె ప్రపంచం బన్న హావాక్యవి
స్ఫురణం దాలిమి గొంత పూనఁ గనవచ్చుంగాక చీకాకులోన్."

నవయుగబుద్ధుఁ డని ప్రసిద్ధి గాంచిన గాంధీమహాత్ముఁడు చేసిన హెచ్చరిక—

"వార్తాపత్రికలలోఁగూడ చాలా నీతిబాహ్యము లగు ప్రకటనలు మిక్కిలి విస్తారముగానే ప్రకటింపఁబడుచున్నవి... కామోద్రేకమును కలుగఁజేయఁజాలిన నీతిబాహ్యము లగు సూచనలే వీనిలో చేయఁబడినవి నీతిబాహ్యములను అసత్యములను తిరస్కరింపవలెను. సభలలో యిట్టిప్రకటనములను నిరసించుచు తీర్మానములను చేయువలయును. ఇట్టిప్రకటనల తిరస్కరించుట ప్రతివానికిని ముఖ్యకర్తవ్యము." (ప్రకృతి, 1-9-1935.)

శ్రీమతి కనుపర్తి వరలక్ష్మిదేవిగారి తీర్మానములు-

"ప్రస్తుతకాలంలో కొందరుపురుషులు వ్రాస్తూన్న కథలు స్త్రీలను

అవమానకరంగా వుంటూన్నవి. కావున యిటువంటికథలు వ్రాయడం అనుచితము. ఇటువంటికథలు ప్రచురించేపత్రికలు స్త్రీసంఘానికి ద్రోహం చేస్తూ వున్నవి. కనుక యిటువంటిపత్రికలను నిరశిస్తూ ఆంధ్రదేశమునందలి మహిళాసంస్థలన్నియు తీర్మానం చేసి స్త్రీల నవమానించుకథలను ప్రచురించుపత్రికలను స్త్రీలు తమయింటికి రానీయరాదనియు, ఒకవేళ వచ్చినట్లయితే చదవకుండానే పట్టున చింపి... యీసభవారు స్త్రీలనందరిని హెచ్చరిస్తున్నారు" (గృహలక్ష్మి, 1-9-1935.)

దేశీయమహాసభాధ్యక్షు లగు శ్రీయుత రాజేంద్రప్రసాదుగారు గుంటూరుసభలో విద్యార్థులకు చేసినప్రబోధము- "శీలమును అలవఱచుకొనుటలో విద్యార్థులు తగుశ్రద్ధను తీసికొనవలయును. ఇతరవిషయములం దెంతగొప్పవాడైనను శీలము లేకున్న వానిగొప్పతన మంతయు వృథా యగును. మనుజునిజీవితమునం దేవిషయము పరికించినను శీలము ముఖ్యావసర మని విదిత మగును." (ఆంధ్రపత్రిక, 19-11-35.)

శ్రీ జొన్నలగడ్డ సత్యనారాయణమూర్తి ఎం, ఏ. బి; ఎల్. గారిపల్కులు "కవిత మనుజుల వున్నతభావోక్తి నుగ్గడించుటకు వినియోగింపబడవలయును గాని, తుచ్ఛశృంగారలాలసత్వమున కుపయోగింపరాదని నాయూహ."

శ్రీ జయపురాధీశ్వరు లగు విక్రమదేవవర్మమహారాజావారి వాక్యములు. "కవులు పామరామోదముకొఱకును, కేవల

ధనార్జనకొఱకును, ప్రతీక్షించి, అనియమభాషతో నసత్కా
వ్యములను రచించుటయు గర్హితకార్యము."

(ఆంధ్రసాహిత్యపరిషద్రజతోత్సవాధ్యక్షోపన్యాసము.)

శ్రీ గొడవర్తి సూర్యనారాయణరావుగారిమాటలు:—
"పరకీయశృంగారాన్ని కాని, భౌతికశృంగారాన్ని కాని, గూర్చి
రచించినపద్యాలు త్యాజ్యాలు." (ప్రతిభ.)

కవికోకిల దువ్వూరి రామిరెడ్డిగారినుడులు:—"మున్నిటి
వైనను నేటివైనను బూతులు బూతులే నాగరికాభిరుచిగల
వారికి అట్టికథలు ఏవము పుట్టించును. అట్టికథలు ఏస్త్రీలను
సంస్కరించుటకు ప్రయత్నించుచున్నారో ఆస్త్రీల ఆత్మగౌర
వమునకే భంగకారులుగ నున్నవి. (ఉదయిని.)

శ్రీ బుర్రా వెంకటసుబ్రహ్మణ్యం బి. యె. బి. యల్.
గారి వచనములు:—"మన కొత్తకథకుల్ని వెనకవేసుకుంటూ
ప్రపంచవాఙ్మయాల్లో మనకుగూడా చోటుందనేందుకు తెలుగు
వాడెవ్వడూ తెలివైనవాడైతేనూ, చదువుకున్నవాడైతేనూ
సాహసించడు."

"ఏదేశములో ప్రజలకు స్త్రీలయెడ గౌరవభావము
వుంటుందో అదే నాగరకమైన దేశము... మన పురాతన పేరు
ప్రతిష్ఠలకుగాని, భావికాలములో దేశములో మనసు కల్పిం
చుకోవలసిన పరిస్థితులకుగాని, యిట్టి వాఙ్మయము సరిపడదు."
(ప్రతిభ.)

ఈతీరునఁ బ్రాజ్ఞు లెల్లరును నవ్యసాహిత్యమునుగూర్చి, మందలించియున్నారు. నిజముగాఁ గవులు సాహిత్యరచనలచే నిజసాహితీకలను మే లనిపింపవలయును గాని మలినకలిత మని పింపరాదు. ఆకర్ణింపుఁడు ఘుడియారమువారి ఘంటారావములు.

"ప్రతివిషయంలోను అందివేసినచేయి అనిపించుకొన్న ఆంధ్రత్వగౌరవాన్ని ఘృతకోశాతకి చేయకుండా నిలబెట్ట పూనికోవాలి. పెద్దలు నిర్మించిన సాహిత్యసౌధాలను కూల ద్రోయు ప్రయత్నాలు విరమించాలి." (ఆంధ్రవారపత్రిక.)

నేఁటికిని ఆంధ్రభారతీమాతను వినయభయభక్తులతో నాహ్వానించి, పూజింపఁ గుతూహలము సూపు నాంధ్రభారతీ నందను లెందఱోకలరు. అట్టి సదాశయుల ప్రేమపూరితము లగు ఘనాహ్వానముల నిటఁదెల్పుట యుచితము.

"పరభాషల్ దల లూఁచు నీసహజలావణ్యంబు గూఢార్థపుం
దెరలం దాఁచక లోక మోహనముగా నీపల్కులన్ దిద్దు నీ
పరువు న్నిల్పు కవిప్రకాండు లిదె,ఆహ్వానించుచున్నారు హై
దరబా దాంధ్రులు పూజ లందికొని పుత్రశ్రేణి దీవింపవే."

"పరభాషలరుచి మఱిగిన
విరసులు కా దమ్మ! తెలుఁగువీరులు వీరిన్
గరుణ మెయి నాదరింపుము
సరస్వతీదేవి! యవనసామ్రాజ్యమునన్."

(జి. జాషువాకవివరేణ్యుఁడు—కృష్ణాపత్రిక.)

మాతృభాషాభిమానులు త్రిలింగసాహిత్యరచనలయందు మనోహరము లగు నాంధ్రపదములనే వాడవలయును కాని, యవనపదములకుఁ దావొసంగరాదు. అట్లు సేయకున్న స్వభాషారూపము వికారము నంది, ముందుకాలమువారికి దాని సౌభాగ్యము గానరానిదశకు వచ్చును కావుననే యిట్లు సుభాషితమున తెలుపఁబడినది.

"నవదేద్యావనీం భాషాం ప్రాణైః కంఠగతైరపి"

అందుచే నన్నయాదికవిసార్వభౌములు నిర్మించిన సువిశాలసాహిత్యరాజవీథులు వీడి, కుకవికల్పితము లగు నిఱుకుదారులఁ జొఱఁబడి, మొఱకుకైతల నల్లుట ఆర్యకవికుమారులకు మర్యాద కాదు.

ఈనవ్యాసభ్యసాహిత్యమువా రిపుడు తమ మిడిముడి కారపుసొంపు నాధారముగాఁ జేకొని యొడుదొడుకుతోఁ బ్రౌఢగ్రాంథికాంధ్రకవితాధౌరేయులఁ దృణీకరించుచున్నారు. కాని,

"తెలివి యొకింత లేనియెడఁ దృప్తుఁడనై కరిభంగి సర్వముం
దెలిసితి నంచు గర్వితమతి న్విహరించితిఁ దొల్లి యిప్పు డు
జ్జ్వలమతు లైనపండితులసన్నిధి నించుక బోధశాలినై
తెలియనివాఁడనై మెలఁగితి న్గతమయ్యె నితాంతగర్వమున్."

అని భర్తృహరి తెలిపినట్లు వీరు కొంతకాలమునకు శాంతోద్రేకులు కాఁగలుగుదురు. ప్రస్తుతము మాత్రము పట్టపగ్గములు లేకున్నది.

నే నీగ్రంథమున విమర్శించినది దేశావమానహేతు కము నసభ్యసాహిత్యము కాని పావనభావశోభిత మగు నూతన కవిత కాదు. నూత్నకవివరేణ్యు లెందఱో పూతభావపూరితము లగు గద్యరచనలను, సభ్యాశయాలంకృతము లగు పద్యరచన లను, ఉన్నతమార్గమున జాను తెలుంగు సొంపెసంగఁ బసందుగా నడపింపఁ బాటుపడుచున్నారు. అట్టిసదాశయు లగుకవిసోదరు లకు హృదయపూర్వకముగా ధన్యవాదముల నందఁజేయు చున్నాను.

ఈనాఁటి నవ్యకావ్యరచనలలో సౌందరనంద మన్నివిధ ముల నానందజనకముగా నున్నది ఇట్టిసత్కవితలు ఆంధ్రసా హిత్యగౌరవపతాక లనఁదగును.

ఒక్కమాటతో నీగ్రంథమును ముగింపనున్నాను. మన వ్రేలితో మనకన్నులు పొడిచికొనునట్లు మనకలముతో మన యువకనీతినేత్రములఁ బొడిచి, వారిని వివేకాంధులనుగాఁ జేయుట భావ్యము కాదు. కావున నవ్యసాహిత్యసోదరులు శాంత చిత్తులై, కర్తవ్యమును బాగుగా యోజింతురుగాక; చూపిం తురుగావుత నాపై సోదరభావమును !

"పాతివ్రత్యపరాః స్త్రియః ప్రసుపతాం పుత్రాః ప్రకృష్టాశయాన్
స్యాన్మర్త్యే సకలోర్వరా నరపతి ర్న్యాయాత్పరం నీతిమాన్
లోకః పాపపరాఙ్ముఖోస్తు విబుధా స్సంతుప్రసన్నాశిషః
భూయాసుః కవయోపి వాక్యచతురా మాంగల్యభావోజ్జ్వలాః"

ఓం తత్సత్ !

—